Phone : 41365

Grams : OFFSET



# PRASAD PROCESS

## PRIVATE LIMITED,

CHANDAMAMA BUILDINGS, MADRAS-26

......Started in 1953 we have installed the latest types of Graphic Arts Machinery, employed the best Artists and Artisans who have been specially trained to execute the finest works for

**YOU**
**and**
**THE TRADE......**

CALENDAR OR A CARTON..
POSTER OR A PACKAGE SLIP..
LABEL OR LETTER DESIGN..

***..... DONE SUPERBLY IN MULTICOLOR***

---

*Bombay Office:*

101, Pushpa Kunj, 16-A, Road, Church Gate, Bombay-1

*Bangalore Representative:*

181, 6th Cross Road, Gandhinagar, Bangalore-9.
Phone: 6555




# 'సన్' వ్యాక్యూమ్ జాడీ

ఈనాటి గృహిణికి వరప్రసాదము.

....కాగా—పాండవుల అరణ్యవాసకాలంలో ఎంతో మంది మునీశ్వరులు, వారి శిష్యులు, అతిథి అభ్యాగతులు వారిని దర్శించటానికి వచ్చేవారు. అందరకూ ద్రౌపది ఆ అద్భుతమగు 'అక్షయ పాత్ర' నుండి వడ్డించేది. పాండవులే తిండికి కటకటలాడిపోయారు; సూర్యభగవానుడు వరమే ప్రసాదించకపోతే ద్రౌపది భరింపరాని పాట్లు పడి ఉండేది.

అతిథి సత్కారానికీ, ఇంట అందరకూ వడ్డన చేయటానికి 'సన్' వ్యాక్యూమ్ ఫ్లాస్కు ఆధునిక 'అక్షయపాత్ర' వంటిది. నిజంగా ఇది ఈనాటి గృహిణికి వరప్రసాదమే.

విక్టరీ ఫ్లాస్క్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మదరాసు

**SUN**

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

చందమామ (అన్ని భాషలలో)

( విడి కాపీ 60 నయా పైసాలు )

సాలు చందా రు. 7-20 నయా పైసాలు

వదినా మరదుల
ఉత్తమ అనుబంధాన్ని
రామాయణ కథలా
రమ్యంగా చిత్రించే
ఉత్తమ చిత్రం!







మధు పిక్చర్స్

# కొడుకులు కోడళ్ళు

దర్శకత్వం:
భీమ్‌సింగ్





మాటలు, పాటలు:
శ్రీ శ్రీ

సంగీతం:
పామర్తి

నవయుగ

అద్వితీయమైన వినోదం!



మోడల్ బి ఎక్స్ ఎస్–338 (చులకనైనది)
8 - ట్రాన్సిష్టర్లు 2 - బ్యాండులు
స్వర నియంత్రణ
రు. 365 ఎక్సైజు సుంకముతో సహా
(పన్నులు అదనము) పట్టుకునే సంచికి అదనము



మోడలు యుసి-143 (టేబల్ మోడలు)
4 - ట్యూబులు 3 - బ్యాండ్లు
ప్రత్యేక రక్షక కమాను
రు. 210 ఎక్సైజు సుంకముతో సహా
(పన్నులు అదనము)



మోడలు బి బడ్ - 490 (చులకనైనది)
9 - ట్రాన్సిష్టర్లు 4 - బ్యాండులు సున్నిత
మైన ట్యూనింగ్ అండ్ రేడికేటర్
రు. 415 ఎక్సైజు సుంకముతో సహా
(పన్నులు అదనము) పట్టుకునే సంచికి అదనము.

# Sharp
# JHANKAR

హయకావా ఎలక్ట్రిక్ కం లి.,
జపాను వారి సాంకేతిక సహా
యంతో నిర్మితము






ట్రాన్సిష్టర్ రేడియోలలో అగ్రగణ్యులు
రేడియో డివిజన్, ఇండియన్ ప్లాస్టిక్స్ లి.,
బొంబాయి–67

ASP/JR-60 TEL

మీ సమీపపు షార్ప్ - ఝుంకార్ డీలరును సంప్రదించండి
ఆంధ్రప్రదేశ్, మద్రాసు, మైసూర్, కేరళ
ప్రాంతీయ పంపకదారులు : జే - ఒ - ఫోన్ కంపెనీ,
13, మింట్ స్ట్రీట్, మదరాసు.

...అంతరాష్ట్రీయ ఖ్యాతిగాంచిన భారతీయ నృత్యతార

# కమలా లక్ష్మణ్

వారి

మెచ్చుకకు పాత్రమైనవి

స్పర్శ..

వన్నెలు..

నమూనాలు..

నాగరికత..

వీటికొరకు

శ్రీ
వెంకటేశ్వర
సిల్క్ చీరలు

శ్రీ వెంకటేశ్వర
సిల్క్ పాలెస్
స్త్రీల ఉన్నతమైన వస్త్రాలకు
నమ్మకమైన స్థలం
284/1, చిక్కపేట, బెంగళూరు-2
ఫోన్: 6440
టెలిగ్రాం: "ROOPRANDHI"

MHRao

పెప్స్ గొంతు మరియు



గుండె బిళ్లలను మీరు సేవించేయడల మీ దగ్గు త్వరితంగా పోవును

పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించే చర్యను జరుపునట్టి అందరి శమనకర ఆవిరులను ఆస్వాదించండి, అవి గొంతు నొప్పి, రొమ్ము పడిశెము, దగ్గు లేక జలుబునుగలిగించే క్రిములను చంపును. పెప్స్ తక్షణ నివారణను గలిగించి క్రిములను నిర్మూలించును.




ఇందులో హానికర ఓషధులు లేవు పిల్లలకు సురక్షితంగా ఇవ్వవచ్చును.

రొమ్ము పడిశెములు, గొంతు నొప్పి, పడిశెము, అధిక కఫము జలుబులు, దగ్గులను త్వరితంగా నివారించును

మందుల వ్యాపారులందరివద్ద అమ్మబడుచున్నవి

సి. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-55-TEL

సోల్ ఏజంట్లు :

దాధా & కంపెనీ,

86, నైనియప్ప నాయక్ వీధి,

మదరాసు - 3


# పాఠకుల లేఖలు

## జూలై 1963

అన్ని కథలకంటె "గంధర్వ చక్రవర్తి కూతురు" చాలా బాగున్నది. "పునర్జన్మ" మరియు "మానసిక భ్రమలు" చాలా బాగున్నవి. "ముక్కు నూటిగా" గమ్మత్తుగా నున్నది.

—వి. ఎస్. కృష్ణయ్య, కోలార్

"పునర్జన్మ", "కొండెగాడూ - కొబ్బరికాయా", "ముక్కు నూటిగా" చాలా బాగున్నాయి. ప్రపంచవింతలలో మక్కా గురించి బాగున్నది.

—కె. విద్యావతి, భిలాయ్

ఈ ఎండల్లో నా మనస్సు వేడెక్కింది. కాని నీ వొచ్చేనరికి ఏక్‌దమ్‌గా చల్లబడింది. అదంతా ఎవరి మహత్యం అనుకుంటున్నావు? క్రెడిట్ అంతా నీకేలే!

—పార్థసారథి, సిర్పూర్ కాఘజ్‌నగర్

నేను గుండు భీమన్న కథలన్నీ మళ్లీ మొదటి నుండీ చదవగా భీమన్నగారు చాలా అభివృద్ధికి వచ్చారు. అయినా అన్ని కథల్లోనూ గుండు భీమన్నత్వం వుండనే వుంది. భలే కథలు!

—కె గోవిందరాజులు మేస్త్రీ, మునిరాబాద్

"చందమామ"లో పడే కథలన్నీ చాలామటుకు బాగుంటాయి. "రాకాసిలోయ"లో సహజ అందము ఉండి అద్భుతముగా వుంటుంది. కాని "గంధర్వ చక్రవర్తి కూతురు" ఏమి సహజంగా ఉండటం లేదు.

—ఇవటూరి వీరభద్రరావు, హైదరాబాదు

"మీకు తెలుసా" శీర్షిక మాకు ఎన్నో కొత్త విషయాలు పరిచయం చేస్తోంది. చాలా ధన్య వాదాలు.

—రమ, బొంబాయి

ఈ నెల ముఖచిత్రం చాల అద్భుతంగా నున్నది. "పునర్జన్మ" నన్ను ఆనంద సముద్రంలో ముంచి నది. ఆర్మీవాళ్లను చాలా ఆనందపరచినది.

—బోగి నారాయణరావు (సైనికశాఖ)

"రాకాసిలోయ"లోని కోయ యువకుడు, తది తరులు చేసిన సాహస కృత్యములు మరువ రానివి. అందువలన ఆ సీరియల్ తొందరగ ముగించవలదని నా విన్నపం.

—తోట అశోక్‌కుమార్, గంపలగూడెం

ఈ నెల "చందమామ" ఎంతో ముచ్చటగా నున్నది. ముఖ్యముగా "రాకాసిలోయ", "మాన సిక భ్రమలు", "ముక్కుసూటిగా", "రామా యణం", "కొండెగాడూ-కొబ్బరికాయా", భారత చరిత్ర చాల ఆకర్షణీయంగా నున్నవి.

—బి. యం. లక్ష్మి నిర్మలకుమారి,
ఉయ్యూరు

మీరు మా చేతను తప్పక "చందమామ"ను కొనునట్లు చేయుచున్నారు. అందులో ఎక్కువ సస్పెన్సుతో కూడిన "రాకాసిలోయ" మమ్ము లను ఎక్కువ ఆకర్షించుచున్నది.

—ఎం. వి. శేషాచార్య, పోలాకి

"మీకు తెలుసా", "కాబా" (ప్రపంచపు వింతలు 19), "మానసిక భ్రమలు" బాగా యున్నవి. ఇవి వాస్తవిక విజ్ఞానమునకు ఎంతో అవసరము.

—జి. శేషయ్య, మద్రాసు


నెరసిన శిరోజాల
గురించి
చింతించ నక్కర్లేదు

హెయిర్ ఆయిల్‌గా



మీరు వాడితే చాలు



సోల్ ఏజెంట్లు అండ్ ఎగుమతి దార్లు
ఎమ్.ఎమ్. ఖంభట్ వాలా,
అహమదాబాద్ (భారతదేశం)
ఏజెంట్లు:
సి. నరోత్తమ్ అండ్ కొ.,
బొంబాయి - 2



రోజూ తొడిగే దుస్తులు

# సన్‌లైట్ వల్ల

## ఎంత తెలుపో ఎంత కాంతియో




వాడుక దుస్తులు ... సన్‌లైట్ వల్ల ఎంతో తెల్లగాను, కాంతిగాను వున్నవి. మీ బట్టలన్నిటినీ ఉతుకుటకు సన్‌లైట్ వాడండి !...

**సన్‌లైట్** ఉత్తమ నురగనిచ్చే శుద్ధమైన సబ్బు

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S. 33-X29 TL




పిల్లల జీవిత విధానమే
ప్రత్యేకముగా ఉంటుంది. వారికి
ఆడుకోవడము అంటే ఎంతో
యిష్టము, అలాగే మాల్టెక్స్
బిస్కట్లను తినడము కూడాను.
సాతె మాల్టెక్స్ బిస్కట్లు
పిన్నా పెద్దలకు ప్రతి రోజు ఎంతో
అవసరమైన అదనపు శక్తిని అందచేస్తాయి.



**సాతె బిస్కట్లు**







సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి. పూనా-2



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలో, "చాణక్యుడి కథ" మొదటి భాగం ప్రకటిస్తున్నాం. చరిత్ర ప్రసిద్ధుడైన మహామంత్రి చాణక్యుణ్ణి గురించి, అనేక కథలు వాడుకలో వున్నవి. యిప్పుడు ప్రకటిస్తున్న కథ జైన పురాణాల లోనిది. ఈ కథలో వున్న చరిత్రాంశం ఏపాటో మనకు తెలుసుకునే అవకాశం లేకపోయినా, చాణక్యుణ్ణి గురించి వున్న కథల్లో దీనికొక ప్రత్యేకత వున్నది.

ఈ సంచిక నుంచి శ్రీ ఉత్పలవారి "శ్రీకృష్ణ లీలలు" గేయకథ ప్రారంభిస్తామని గత సంచికలో తెలియజేశాము. కాని ఆ ప్రయత్నం మానుకొన్నందుకు పాఠకులు అన్యథా భావించరని తలుస్తాము. రామాయణం అనంతరం భాగవత కథ రంగుల బొమ్మల సీరియల్‌గా ప్రచురించ నిర్ణయించటమే ఈ మార్పుకు కారణం.

సంపుటి: 33 - జూలై 1963 - సంచిక: 1









# భారత చరిత్ర



అలా ఉద్దీన్ మంగోలులను అనేకమార్లు ఓడించటమేగాక తన వాయువ్య సరిహద్దును రక్షించుకోవటానికి తగు ఏర్పాట్లు చేశాడు. మంగోలులు వచ్చే దారిలో గల కోటలన్నీ మరమ్మతు చేయించి, కొత్తవి కూడా నిర్మింపజేశాడు.

సరిహద్దు నగరాలైన సామానా, దీలాల్పుర్ల వద్ద యుద్ధ సన్నద్ధమై ఉండే సైనిక స్థావరాలు ఏర్పాటు చేశాడు. ఘాజీ మలిక్ (ఘియాజుద్దీన్ తుఘ్లక్)ను సరిహద్దు రక్షణకు నియోగించాడు.

ఘాజీ మలిక్ మంగోలులను పాతిక సంవత్సరాలపాటు సమర్థతతో నిగ్రహించాడు.

ఢిల్లీ పరిసరాలలో నివాసాలు ఏర్పరచుకున్న "కొత్త ముస్లిములు" (మంగోలులు) తమ పదవీ/కాంక్ష తీరనందున తిరుగుబాటు చేశారు. పైగా సుల్తాను ఉద్యోగాలలో ఉన్న వారిని కూడా తొలగించాడు. వారు సుల్తానును హత్య చేయటానికి చేసిన కుట్ర బయట పడింది. ఒక్క రోజులో సుల్తాను 20, 30 వేలమంది "కొత్త ముస్లిములను" నిర్దాక్షిణ్యంగా వధ చేయించాడు.

అలా ఉద్దీన్ హయాంలోనే ఆయన రాజ్యం విస్తరించి సామ్రాజ్యంగా రూపొందింది; ఈ సామ్రాజ్యం అర్ధ శతాబ్దం పాటు దక్కింది. అలా ఉద్దీన్ తమ్ముడైన ఉలుఘ్ ఖాన్, వజీరైన నుస్రత్ ఖాన్ ఒక పెద్ద సేనతో 1297లో గుజరాతుపై దాడి చేశారు. లోగడ ముస్లిములు గుజరాతును కొల్ల గొట్టారేగాని జయించలేదు. ఈసారి గుజరాతు లొంగి పోయింది. రాజైన రెండవ కర్ణదేవుడు తన కుమార్తె అయిన దేవలాదేవితో రాజ్యం విడిచి పారిపోయాడు. రాణి కమలాదేవి గొప్ప అందగత్తె. ఆమె శత్రువులకు చిక్కి, కాలక్రమాన అలా ఉద్దీన్‌కు ప్రియ భార్య అయింది.

కొందరు "కొత్త ముస్లిములు" రంథం బోడ్ రాజైన హమీరదేవుడి పంచ చేరారు. అలా ఉద్దీన్ మండి పడి 1299లో తన తమ్ముణ్ణీ, వజీరునూ సేనతో ఆరాజ్యం పైకి పంపాడు. అలా ఉద్దీన్ సేనలు అపజయం పొందటమేగాక, వజీర్ నుస్రత్ ఖాన్ చచ్చి పోవటం కూడా జరిగింది. అప్పుడు సుల్తాను స్వయంగా వచ్చి 1301 జులైలో రంథం బోడ్‌ను జయించాడు. ఈ విజయం ఒక ఏడాది ముట్టడి అనంతరం అతి కష్టం మీద లభించింది. హమీరుడి మంత్రి రణమల్లు డనేవాడు స్వామి ద్రోహం చేసి శత్రు పక్షం అయాడు. అలా ఉద్దీన్ ఈ రాజద్రోహిని బహూకరించక వధ చేశాడు. హమీరుడూ, అతని అండ చేరిన "కొత్త ముస్లిములూ" వధించ బడ్డారు. అంతఃపుర స్త్రీలు చితి పేర్చుకుని అందులో దగ్ధమైపోయారు.

అలా ఉద్దీన్ మేవాడ్ పై చేసిన దాడి అందరికీ తెలిసినది. ఈ దాడికి ముఖ్య కారణం చితోడ్ రాణి పద్మిని యొక్క అందమేనని చెబుతారు. పద్మిని భర్త అయిన రాణా రతన్‌సింగ్ అలా ఉద్దీన్ సైనికులకు దొరికిపోగా, అతన్ని సుల్తాను గుడారానికి తీసుకుపోయేదారిలో రాజ పుత్రులు అడ్డు పడి అద్భుత సాహసంతో



తమ రాజును కాపాడారు. చితోడ్ వెలుపలి ద్వారం వద్ద గోరా, బాదల్ అనే రాజపుత్ర వీరులు కొద్దిమంది సైనికులతో సుల్తాను సేనలను కొంతసేపు నిరోధించ గలిగారు. చితోడ్ పతనంకాక తప్పదని తెలియగానే పద్మిని మొదలుగా గల అనేక వేలమంది రాజస్త్రీలు అగ్నికి ఆహుతి అయారు.

1303 అగస్టు 26న చితోడ్ పతన మయింది. దాని పేరు ఖిజ్రాబాద్ అని మార్చి సుల్తాను తన కొడుకైన ఖిజ్ర్ ఖాన్‌ను దానికి అధిపతిని చేశాడు.

1305 అంతంలో మాల్వా, సుల్తానుకు ఓడిపోయింది. దానికి రాజైన మహ్లాక

దేవుడూ, ప్రధాని కోక కూడా వధించబడ్డారు. ఉజ్జయినీ, మాండూ, ధార్, చందేరీ మొదలైనవి క్రమంగా ముస్లిముల వశమై, 1305 నాటికి దాదాపు ఉత్తర భారతదేశమంతా ఖల్జీ సామ్రాజ్యంలో చేరిపోయింది.

అలా ఉద్దీన్ కన్ను దక్షిణ భారతంపై పడింది. అక్కడి పరిస్థితులు కూడా సుల్తానుకు అనుకూలంగానే ఉన్నాయి. అనాడు నాలుగు ప్రముఖ రాజ్యాలుండేవి, వాటిని నలుగురు రాజులు పాలించేవారు. ఒకడు దేవగిరిని పాలించే యాదవరాజు రామచంద్రదేవుడు (1271-1309) ఇతను ధర్మపరుడూ, సమర్థుడూనూ. రెండవవాడు కాకతీయ వంశానికి చెందిన మొదటి ప్రతాపరుద్రుడు. ఇతను వరంగల్లు రాజధానిగా తెలంగాణను పరిపాలించాడు. మూడవవాడు హొయసలరాజు మూడవ వీరబల్లాలుడు (1292-1342). ఇతను, ఈనాటి హళెబీడు వద్ద రాజధాని కలిగి ఇప్పటి మైసూరు రాజ్య ప్రాంతాన్ని పాలించాడు. నాలుగవవాడు మారవర్మ కులశేఖరుడు (1268-1311) ఇతను పాండ్య దేశాన్ని పాలించాడు. ఈనాటి మదుర, రామనాద్, తిరునెల్వేలి జిల్లాలు ఈ రాజ్యంలో చేరి ఉండేవి. వ్యాపారం మూలంగా పాండ్య రాజ్యం సంపదతో తులతూగు తూండేది. వీరుగాక కొందరు చిల్లర రాజులుండేవారు; నెల్లూరులో తెలుగు చోళరాజు మూడవ మనమసిద్ధి, ఓఢ్రదేశంలో కళింగ గంగరాజు భామదేవుడూ, కేరళలో రవివర్మా, మంగళూరులో బంకిదేవ అలుపేంద్రుడూ మొదలైనవారు.

ఈ రాజుల మధ్య ఎలాటి ఐకమత్యమూ లేకపోగా, కొంత శత్రుత్వం కూడా ఉండటం, అంతఃకలహాలు సాగటమూ అలా ఉద్దీన్ సామ్రాజ్య విస్తరణకు ఎంతగానో తోడ్పడింది.





# మనోవ్యాధే మందు

అనగనగా ఒక రాజు. ఆ రాజు అష్టయిశ్వర్యాలతో తులతూగుతూ, చీకూ చింతా లేకుండా ఛాలా కాలం జీవించాడు. రాజ్యానికి శత్రుభయం లేదు. రాచకార్యాలు చూడటానికి సమర్థులైన మంత్రులున్నారు. ఇంక రాజుగారికి ఉన్న పనల్లా ఏమిటంటే సుష్టుగా భోంచెయ్యటమూ, కడుపులో చల్ల కదలకుండా కూచుని రకరకాల వినోదాలు అనుభవించటమూనూ.

ఇలా ఏళ్ళతరబడి తిని కూచుంటే ఎవడికైనా ఒళ్ళు కొవ్వెక్కి పోతుంది. రాజుగారికీ అంతే అయింది. పొట్ట బానలాగా పెరిగింది. ఒళ్ళు లావై బరువెక్కిపోయింది. కూర్చున్నవాడు లేవటంకూడా కష్టమయింది. నడవటానికి అసలే శక్తి లేదు.

తన స్థితి తలుచుకుంటే రాజుగారికే భయం పుట్టుకొచ్చింది. శరీరం ఐరావతంలాగా పెరిగిపోయిందాయె, అడుగు తీసి అడుగు పెట్టలేడాయె! సన్నగా ఉన్న వాళ్ళనీ, గబగబా నడిచే వాళ్ళనీ, చువ్వల్లాగా వంగి లేచే వాళ్ళనీ, సునాయాసంగా పరిగెత్తే వాళ్ళనీ చూసి ఆ రాజు, "అయ్యో, నేనలా లేకపోతినే! ఈ ఒళ్ళు కరిగితే ఎంత బాగుణ్ణు!" అనుకునేవాడు.

ఏళ్ళతరబడి పెంచిన ఒళ్ళు వద్దనుకుంటే పోతుందా? దాని కేదో ఒకటి చెయ్యాలిగద! తన ఒళ్ళు తగ్గించే ఉపాయం చూడమని మంత్రులను అజ్ఞాపించాడు. మంత్రులు మాత్రం ఏం చెయ్యగలరూ? వైద్యులను పిలిపించి సలహా అడిగారు. వైద్యులేవో మందు లిచ్చారు. రాజుగారు మందైతే తింటాడుగాని, పథ్యాలు చెయ్యడు. పథ్యాలు సరిగా ఉండకపోతే మందులు పని చెయ్యవు. రాజుగారి శరీరం తేలిక చెయ్యటం తమకు సాధ్యంకాదని వైద్యులు చేతులు కడిగేసుకున్నారు.

ఎ. ఎల్. మోహన్‌రావు




ప్రయత్నాలు వ్యర్థమవుతున్నకొద్దీ రాజుగారికి చిక్కాలన్న ఆదుర్దా జాస్తి అయింది. తనని సన్నగా చువ్వలాగా చేసిన వాడికి అర్థ రాజ్యమైనా ఇచ్చేస్తానని ఆయన మంత్రులతో అన్నాడు. మంత్రులు అదే విధంగా చాటింపు వేశారు. అర్ధరాజ్యంకోసం ఆశపడి అడ్డమైన వాళ్ళూ వచ్చి రాజుగారిని హైరానపెడతారేమోనని మంత్రు లెంచేశారంటే, రాజుగారి శరీరం తగ్గించిన వాళ్ళకి అర్ధరాజ్య మిస్తామనీ, చికిత్స ప్రారంభించి విఫలులైనవాళ్ళని ఉరి తీసేస్తామనీ చాటింపు వేశారు. అంటే ఏమిటన్నమాటా? వస్తే అర్ధరాజ్యం, పోతే ప్రాణం! అర్ధరాజ్యం రాకపోతే మానె, చావటానికి ఎవడు సిద్ధపడతాడూ? అంచేత చాటింపు విని ఎవడూ, "మేము రాజుగారికి చికిత్స చేస్తాం!" అని చెప్పి ముందుకు రానేలేదు.

ఈ చాటింపు కూడా పారలేదని రాజు విచారిస్తూండగా యోగానందుడనే గోసాయి వచ్చి, ఆయన శరీరం తగ్గిస్తానన్నాడు.

"అందుకుగాను ఏ ఔషధాలు ఉపయోగించేదీ మాకు చెప్పాలి. మా ఎదటే వాటిని తయారు చెయ్యాలి," అన్నారు మంత్రులు గోసాయితో.

"మామూలు మందులన్నీ మీరు వాడే ఉంటారు. నేను రోగి యొక్క జాతకం చూడనిదే మందివ్వను. అందుకే నా వైద్యానికి తిరుగులేదు. రాజుగారి జాతక చక్రం ఇప్పించండి," అన్నాడు గోసాయి.

మంత్రులు రాజుగారి జాతకం గోసాయికిచ్చారు. గోసాయి దాన్ని చాలాసేపు పరిశీలించి, చప్పరించి, "రాజుగారికి మందులతో పని లేదు. ఇంకా ముప్పై రోజులకు ఆయన ఆయుర్దాయం ఎలానూ తీరిపోతున్నది," అన్నాడు.

"రాజుగారి జాతకం చూసి ఎవరూ ఈ మాట అనలేదు. నీవు చెప్పేది పట్టి అబద్ధం," అన్నారు మంత్రులు.

"నేను చెప్పేది అక్షరాలా జరిగి తీరుతుంది. నా మాట నమ్మకం లేకపోతే ఈ ముప్ఫై రోజులూ నన్ను నిర్బంధంలో ఉంచండి," అన్నాడు గోసాయి.

మంత్రులు గోసాయిని ఖైదులో ఉంచి అతడి అన్నపానాదులకు తగిన ఏర్పాట్లు చేశారు. రాజుగారికి మాత్రం గోసాయి చెప్పిన జోస్యంలో గురి కుదిరింది. తన జోస్యంలో ఎంత నమ్మకం లేకపోతే ఆ గోసాయి తనకు తానై ఖైదులో ఉంటాడు!

ఇంక ముప్ఫై రోజులకు చచ్చిపోతానన్న భయం రాజుగారిని బాగా పట్టుకుని మనోవ్యాధి కింద పరిణమించింది. ఒక్కొక్క క్షణమే గడుస్తుంటే తన ప్రాణం కొంచెం కొంచెమే పోతున్నట్టు అనిపించేది. ఆయనకు వినోదాలు చూడాలన్న ఆసక్తి పూర్తిగా పోవటం అటుంచి, అన్నహితవు తప్పింది, కంటికి కునుకన్నది రాకుండా పోయింది.

ఆరోజు కారోజు రాజుగారి మనోవ్యాధి పెరగసాగింది. గోసాయి మాటలు నిజం కావని మంత్రులు ఎంత ధైర్యం చెప్పినా రాజుగారి మనోవ్యాధి తగ్గలేదు. గోసాయి చెప్పిన గడువు పూర్తి అయే రోజుల్లో ఆయన పూర్తిగా మంచం పట్టాడు; బంధువులతో, మంత్రులతో మాట్లాడటం కూడా మానేశాడు.



ముప్పై రోజులూ ఎలాగో గడిచాయి. రాజుగారు చిక్కి శల్యమయ్యాడే తప్ప చావలేదు.

ముప్పై ఒకటో రోజున ఆయన మనో వ్యాధి తీసేసినట్టుగా పోయింది. ఆయన మంచం మీది నుంచి లేచి గబగబా మంత్రు లుండే చోటికి వెళ్ళి, "ఆ దుర్మార్గు డెక్కడ? అబద్ధం చెప్పినందుకు ఆ గోసాయి వాణ్ణి కొరత వెయ్యండి," అన్నాడు.

మంత్రులు ఖైదు నుంచి గోసాయిని విడి పించి తెప్పించారు. రాజుగారు బోనులో పులిలాగా అటూ ఇటూ పచారు చేస్తూ గోసాయిని చూడగానే అతడి పైకి వెళ్ళి, "దుర్మార్గుడా! తప్పుడు జోస్యం చెప్పి నన్ను హింసిస్తావా? నీకేమి శిక్ష విధిం చాలి?" అని అడిగాడు.

గోసాయి చిరు నవ్వు నవ్వి, "శిక్షా? నాకింకా బహుమానం ఇస్తారనుకుంటు న్నానే!" అన్నాడు.

"నాకు ఆయుర్దాయం లేదని అబద్ధాలు చెప్పినందుకు నీకు బహుమానమా?" అన్నాడు రాజు నిర్ఘాంతపోయి.

"రాజా, నేను మీకు చికిత్స చెయ్య వచ్చానుగాని జోస్యం చెప్పటానికి రాలేదు. మీ కొవ్వంతా కరిగిపోయింది. మీ శరీరం చువ్వలాగా అయింది. మీరు తేలికగా నడవ గలుగుతున్నారు. కావలిస్తే పరిగెత్తగలరు కూడానూ. ఇంతా అయాక నేను చేసినది చికిత్సకాదంటారా?" అన్నాడు గోసాయి.

రాజుగారు ఆశ్చర్యపడ్డాడు. ఆయన నిలువుటద్దం దగ్గిరికి వెళ్ళి తన శరీరం చూసుకుని పరమానందం చెందాడు. పొట్టంతా మాయమయింది. కొవ్వంతా కరిగి పోయింది. ఇప్పుడు తాను అందరిలాగే ఉన్నాడు. మనోవ్యాధి మందులాగా పని చేసింది. "ఈ గోసాయికి అర్ధ రాజ్యం ఇచ్చేసెయ్యండి," అన్నాడు రాజు తన మంత్రులతో.






## 25

[కేశవుడూ అతడి స్నేహితుల నుంచి, రెక్కల మనుషులు పారి పోయారు. అదే సమయంలో శ్వానకర్ణి అనే అడవిజాతి వాడి ముఠా, వాళ్ళను చుట్టు ముట్టారు. జయమల్లు శ్వానకర్ణికి—తను సహాయం చేస్తానన్న బిడాలికి రాజీకుదిర్చేందుకు ఒప్పుకుని; బిడాలి అనుచరుణ్నొకణ్ణి, వాళ్ళ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు పంపాడు. —తరవాత]

తమ నాయకుణ్ణి పిలుచుకు వచ్చేందుకు బయలుదేరిన బిడాలి అనుచరుడికి, దారిలో బిడాలి మరి పదిమంది తన ముఠావాళ్ళతో ఎదురయాడు. వాళ్ళందరి దగ్గిరా రకరకాల ఆయుధాలున్నాయి. అందరూ చెట్లచాటున పొంచి నడుస్తూ ముందుకు వస్తున్నారు. బిడాలి తన అనుచరుణ్ణి చూసి, "ఎందుకలా పరిగెత్తుతున్నావు ? ఏం జరిగింది ?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

బిడాలి అనుచరుడు, తను కేశవుడూ వాళ్ళచేత ఎలా రక్షించబడ్డాడో, రెక్కల మనుషులు ఏ విధంగా వాళ్ళ బాణాల దెబ్బకు అందకుండా పారి పోయారో, చెప్పబోయే సరికి, బిడాలి అతణ్ణి వారిస్తూ, "ఆ సంగతంతా, నీ వెంట వున్నవాడు వచ్చి చెప్పాడు. నే నడిగేది; మిమ్మల్ని ఆ శ్వానకర్ణి దుర్మార్గుడి ముఠావాళ్ళు చుట్టు ముట్టిం తరవాత జరిగిందేమిటని,"



అన్నాడు. బిడాలి అనుచరుడు శ్వానకర్ణి ముఠా నివశించే కొండ గుహ దగ్గిర జరిగిన సంభాషణా, జయమల్లు చేసిన వాగ్దానం సంగతీ చెప్పి, "వాళ్ల మూలపురుషుడి రాతి గద తెచ్చి యిస్తే, తను మనతో శత్రుత్వం మానుకుంటానని శ్వానకర్ణి చెప్పాడు. జయమల్లు ఆ రాతి గద తెమ్మని నీకు చెప్పవలసిందిగా నన్ను పంపాడు," అన్నాడు.

రాతి గద పేరు వింటూనే బిడాలి గతుక్కుమని, తన అనుచరులకేసి కళ్ళెర్ర చేస్తూ చూశాడు. వాళ్ళంతా తలలు వంచుకున్నారు. బిడాలి వచ్చే కోపాన్ని అపుకుంటూ, "నేను ముందే చెప్పాను. కాని,



మీలో ఏ ఒక్కరికీ బుద్ధీ జ్ఞానం వున్నట్టు లేదు. మీరంతా కలిసి, ఆ భాగమారాను ప్రోత్సహించి, చేయించిన వెధవ పనితో ఎన్ని చిక్కులు వచ్చినయ్యో చూశారా? ఇప్పుడా రాతి గద ఎక్కడ వున్నదని వాళ్ళకు చెప్పేట్టు?" అన్నాడు.

"చాతనైతే, వాళ్ళ పూర్వీకుడి గదను ఆ శ్వానకర్ణినే తెచ్చుకోమనండి. ఆ రాతి ముక్క కోసం ఎంతో ధైర్యశాలీ, బలశాలీ అయిన మనవాడొకడు చచ్చాడు," అన్నాడు బిడాలి అనుచరుల్లో ఒకడు.

బిడాలి కోపాన్ని అపుకోలేక చేతిలోవున్న ఈటెను బలంగా ఒకసారి నేలకు తాటించి, "వాడి కెంత ధైర్యం బలంవుంటే మాత్రం, నిప్పులు కక్కే సింహాన్ని చంపగలడా? ఆ ప్రయత్నంలో వాడూ చచ్చాడు, గదా పోయింది," అంటూ ఒక్క క్షణకాలం ఆలోచించి, "ఇక నడవండి. జరిగిందేదో ఆ శ్వానకర్ణికే చెబుదాం," అన్నాడు.

"మనం పదిమంది కంటె ఎక్కువలేం. శత్రువు గుహకు ఎలా వెళ్ళటం? వాళ్ళు మన మీది కొస్తే, మనం ఏమయేట్టు?" అన్నాడొకడు బిడాలి కేసి చూస్తూ.

"ఇదీ మీ ధైర్యం! అంత ప్రాణ భయం వున్నవాళ్ళు, ఆ రాతి గద జోలికెందుకు

పోయారు? సరే. అదంతా యిప్పుడు తవ్వి లాభంలేదు. శ్వానకర్ణి నుంచి మన కెలాంటి ప్రమాదం రాకుండా, ఆ కేశవుడూ, జయమల్లూ, గోమాంగ్ రక్షించగలరు. వాళ్ళ చేతుల్లో వున్న కొత్తరకం అయుధాలు చూశారుగదా. వాటి దెబ్బకు తిరుగులేదు," అన్నాడు బిడాలి.

బిడాలి తన ముఠావాళ్ళతో కేశవుణ్ణీ అతడి స్నేహితుల్నీ సమీపించేసరికి, అక్కడ వాళ్ళు శ్వానకర్ణితో మాట్లాడుతున్నారు. బిడాలి రావటం చూస్తూనే, శ్వానకర్ణి కోపంతో ముక్కుపుటాలు ఎగరవేస్తూ, "చూశారా! వాళ్ళు ఆ రాతి గద తేవటం లేదు. వాళ్ళతో ఇంక రాజీమాట లేమిటి?" అన్నాడు కోపంగా.

జయమల్లు, బిడాలి కేసి తిరిగి, "ఏం బిడాలీ! ఆ రాతి గద వెంట తెమ్మని నీ అనుచరుడితో కబురు చేశానే. ఎందుకని తేలేదు? శ్వానకర్ణితో శత్రుత్వం యింకా పొడిగించాలని వున్నదా?" అని అడిగాడు.

"నా కెవరితోనూ శత్రుత్వం నెరపాలని లేదు. ఈ అరణ్యంలో ఏ ముఠావాళ్ళతోనూ నాకు విరోధం లేదు. కావాలని శ్వానకర్ణే నాతో విరోధం పెట్టుకున్నాడు. మా వాళ్ళు దొంగిలించారనే రాతి గద లాంటివి ఇరవై



రాతి గదలు అతడి కివ్వగలను. సరా," అన్నాడు బిడాలి.

"నాక్కావలసింది, మా మూలపురుషుడి రాతి గద. దానిలో ఎంతో మహత్తు వున్నది. మీరు దొంగిలించుకుపోయిన దానికి బదులుగా వెయ్యి గద లిస్తామన్నా, నే నొప్పను," అన్నాడు శ్వానకర్ణి రౌద్రంగా.

"ఆ మహత్తున్నమ్మే, మావాడు మడుగు పక్క గుహలోవున్న నిప్పులుకక్కే సింహాన్ని చంపేందుకు వెళ్ళి, హతమారిపోయాడు," అన్నాడు బిడాలి యీసడింపుగా.

"అది సరే, గద ఎక్కడున్నది?" అని ప్రశ్నించాడు జయమల్లు.



నా కేమీ తెలియదు. నా ముఠాలోని కుర్ర కారు ప్రోద్బలంతో వాడా పని చేశాడు. తగిన శిక్ష అనుభవించాడు," అన్నాడు.

జయమల్లు, శ్వానకర్ణి దగ్గిరకు వచ్చి, "శ్వానకర్ణీ, నువ్వు బిడాలి మాటలు నమ్మ వచ్చు. మీ మూలపురుషుడి గదలో అంత మహత్తు వున్నదనుకుంటే, దానిని మేము తెచ్చి పెట్టగలం. మీరూ మీరూ సఖ్యంగా వుండండి," అన్నాడు.

"బిడాలి మాటలు నమ్మటం అంటే, ఆ గద నిప్పులుకక్కే సింహం గుహలో వున్నదనుకోవాలి. సింహం మనిషిని తిన్న దేమోకాని, రాతి గదను కూడా తిన్న దను కోవటం కుదరదుగదా? ఆ సింహం గుహలో ప్రవేశించి, ఆ గదను మీ రెలా తేగలరు?" అన్నాడు శ్వానకర్ణి ఆశ్చర్యంగా.

"మా శక్తి యింకా మీకు తెలియలేదన్న మాట. పదండి, ఆ సింహంవుండే మడుగూ, గుహా చూపండి," అంటూ జయమల్లు ముందుకు రెండడుగులు వేశాడు. కేశవుడూ, కోయగోమాంగ్ అతడి వెనక బయలుదేరారు.

బిడాలి శ్వానకర్ణి తమ తమ అనుచరు లతో అరణ్యంలో కొంత దూరం నడిచి ఒక పెద్ద నీటి మడుగు దగ్గిరకు వచ్చారు. ఆ నీటి మడుగుకు అవతలి ఒడ్డున ఒక ఎత్తయిన

"గదా వాడూ కుడా అయిపూ అజా లేకుండా పోయారు. ఆ సింహం వున్న గుహలోకి వాడు ప్రవేశించటం చూసిన వాళ్ళున్నారు తప్ప, బయటికి రావటం చూసిన వాళ్ళు లేరు. అది వాణ్ణి చంపి తినేసి వుంటుంది," అన్నాడు బిడాలి.

"మోసం! నేను నమ్మను!" అంటూ శ్వానకర్ణి అరవటం ప్రారంభించాడు.

జయమల్లు బిడాలిని దూరంగా తీసుకు పోయి, నిజం చెప్పవలసిందిగా కోరాడు. బిడాలి ప్రమాణాలు చేసి జరిగినదంతా చెప్పి, "ఆ భాగ్‌మారా నా ముఠావా డయినా, ఆ గద దొంగిలించటం సంగతి

కొండ వున్నది. అందులో అనేక గుహలు వున్నవి. మడుగునీరు, కొండ అంచువరకూ అనుకుని పార్లిపార్లి ప్రవహిస్తున్నది. ఒక పెద్ద నీటిపాయ ఏదో ఆ మడుగులోంచి, దూరంగా వున్న కొండల కేసి ప్రవహించటం జయమల్లు గమనించాడు.

"అదుగో, ఆ కనిపించే పెద్ద గుహ సింహానికి నివాసస్థానం. అక్కడికి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వచ్చినవాడెవడూ లేడు," అన్నాడు బిడాలి. శ్వానకర్ణి అవునన్నట్టు తలాడించి జయమల్లు కేసి చూశాడు.

జయమల్లు, కేశవృష్ణీ, కోయగోమాంగ్‌నూ కొంచెం దూరంగా తీసుకువెళ్ళి, సాహసించి సింహం వున్న గుహలోకి ప్రవేశించి, దానిని చంపటమా, మానటమా అన్న సమస్య గురించి చర్చించాడు. ఇంత దూరం వచ్చిం తరవాత, యిప్పుడు వెనక్కు తిరగటం తెలివైన పని కాదని కేశవుడూ, గోమాంగ్ కూడా సలహా యిచ్చారు. కాని, నిప్పులు కక్కే సింహం అంటున్నారే, దాన్ని తమ బాణం దెబ్బలతో చంపగలగటం సాధ్యమా అన్న అనుమానం వాళ్ళకు కలిగింది.

"ఎంత బలమైన మృగాన్నయినా సరే, ఒక్క అంబు దెబ్బతో కదలా మెదలక. పడేలా చేయగలిగిన విషం నా దగ్గిర వున్నది.



ఆ విషం పూసిన బాణం తగిలితే, ఆ సింహం చాపచుట్టలా కింద పడి వూరుకుంటుంది. కాని, బాణం గురి తప్పితే మాత్రం మనకు చావు తప్పదు," అన్నాడు గోమాంగ్.

"మూడు బాణాలు గురి తప్పటం సాధ్యమా?" అన్నాడు కేశవుడు.

"కాని, అది హఠాత్తుగా మన మీద ఏ రాళ్ళచాటునుంచో దూకితే, ఏంగాను?" అని ప్రశ్నించాడు గోమాంగ్.

"ఆ ప్రమాదం రాకుండా, మనం తగు జాగ్రత్తలో వుందాం. అసలు ఆ సింహం ఆ గుహలో వున్నదో, మరెటయినా పోయిందో ముందు తెలుసుకోగలిగితే బావుణ్ణు. అది



గానే, శ్వానకర్ణి తన ముఠావాళ్ళను పంపి, పది మేకలనూ, కొన్ని ఎనుబోతులనూ అక్కడికి తెప్పించాడు. తరవాత వాటి నన్నిటినీ ఒకదానికొకటి తాళ్ళతో కట్టి, మడుగు కవతల వున్న కొండ గుహ కేసి తోలించాడు.

జంతువులు నీటిలో ఈదుతూ సింహం వుండే గుహ కేసి మామూలుగానే వెళ్ళి, గుహ మరి కొంచెం దూరంలో వుందనగా, పెద్దగా బెదిరిపోయి, తాళ్ళు తెంచుకుని, అరుస్తూ చెల్లా చెదురుగా నీటి వాలున పడి పారిపోసాగినై.

"సింహం గుహలోనే వున్నది, సందేహం లేదు. కాని, అది జంతువులను పట్టేందుకు గుహ నుంచి బయటికి ఎందుకు రాలేదో, తెలియకుండా వున్నది," అన్నాడు బిడాలి.

శ్వానకర్ణి వికటంగా నవ్వుతూ, "నీ ముఠా వాళ్ళు దానికి మనిషి మాంసం రుచి ఎలా వుంటుందో చూపెంచారు. ఇక అది మను షుల్ని తప్ప తినదు. చాతనైతే మీ వాడి నొకణ్ణి పంపు, గుహలోనుంచి బయటికి దూకు తుంది," అన్నాడు.

శ్వానకర్ణి మాటలకు ఉగ్రుడైపోయి బిడాలి ఏదో అనబోయేంతలో, జయమల్లు అతణ్ణి సమాధానపరుస్తూ, "ఇప్పుడు మళ్ళీ

నిశ్చయంగా గుహలో వున్నదని తెలిస్తే, అది మన మీద దొంగ చాటుదెబ్బ తీయకుండా జాగ్రత్తపడవచ్చు," అన్నాడు జయమల్లు.

"సింహం గుహలో వున్నదీ లేనిదీ తెలుసుకోవటం, ఏమంత కష్టంకాదు. కొన్ని జంతువులను—ఏ మేకల్నో, దున్నపోతుల్నో ఆ గుహకేసి తోలితే, నిజం తెలిసిపోతుంది. వాటిని చూసి సింహం గుహనుంచి బయటికి రావచ్చు. లేదా, జంతువులు అది వున్నట్టు వాసనపట్టి దూరంగా పారిపోవచ్చు," అన్నాడు కోయ గోమాంగ్.

ఈ ఉపాయం జయమల్లుకూ కేశవుడికీ కూడా నచ్చింది. వాళ్ళు ఈ సంగతి చెప్ప

మీరు తగూలాడుకోకండి. సింహాన్ని చంపి, రాతిగద తెచ్చేపని మానెత్తిన వేసుకున్నాం. మీరు చేయవలసిందల్లా, మాకు ఒక తెప్ప కట్టివ్వటం," అన్నాడు.

శ్వానకర్ణి అజ్ఞ యివ్వగానే అతడి అనుచరులు కొన్ని ఎండు కఱ్ఱలు తెచ్చి, వాటిని చెట్ల ఊడలతో గుదికట్టి మడుగులోకి తోశారు. ఈ లోపల కోయ గోమాంగ్, తను దాచి వుంచుకున్న విషాన్ని అన్ని బాణాల మొనలకూ రాసి, వాటిని బాగా ఎండ పెట్టాడు. ముగ్గురూ తెప్ప ఎక్కి, అది తోసేందుకు అమర్చిన గడ కఱ్ఱలను చేతికి తీసుకున్నారు.

జయమల్లు, మడుగు ఒడ్డున నిలబడివున్న బిడాలినీ, శ్వానకర్ణినీ ఉద్దేశించి, "మీరు, యిక్కడ వున్నా సరే, లేక శాంతంగా ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయినా సరే, మాకు అభ్యంతరం లేదు. మేము ఒక గంటలో ఆ రాతి గద తీసుకుని వస్తాం," అన్నాడు.

బిడాలిగాని, శ్వానకర్ణిగాని మాట్లాడలేదు. వాళ్ళిద్దరికీ జయమల్లూ అతడి అనుచరులు యిక తిరిగి రావటం అంటూ వుండదన్న భయం పట్టుకున్నది. అది గ్రహించిన జయమల్లు, "గంట ఎందుకు, పావుగంటలోనే తిరిగి వస్తాం. రాతి గదను శ్వానకర్ణికీ, నిప్పులుకక్కే సింహం చర్మాన్ని బిడాలికీ బహూకరిస్తాం," అన్నాడు పెద్దగా.

తెప్ప క్రమంగా మడుగు దాటి సింహం వుండే గుహను సమీపించింది. "గుహలో ఏదో అలికిడైనట్టు నాకు అనుమానంగా వున్నది," అన్నాడు కోయ గోమాంగ్.

"అనుమానాలతో ఏం పని, మనం గుహలోకి వెళ్ళబోతున్నాం గదా," అంటూ కేశవుడు, తెప్ప ఒడ్డు తాకగానే ఎగిరి గంతేసి కిందికి దూకాడు. ముగ్గురూ నిశ్శబ్దంగా నడుస్తూ గుహను సమీపించి, లోపలికి తొంగిచూశారు. —(ఇంకావుంది)






# పరీక్షా ఫలితం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ వంటి ప్రభువులు ఇలాటి దారుణ పరీక్షలకు గురి కావటం నే నెన్నడూ ఎరగను. రాజులే తమకు ఇష్టం లేని వారిని నిర్మూలించటానికి సాధారణంగా క్రూరమైన పరీక్షలు పెడతారు. ఇందుకు తార్కాణంగా నీకు సుబుద్ధి అనే మంత్రి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు దక్షిణా పథాన రత్నగడ మనే రాజ్యాన్ని సత్యజిత్తుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన ధర్మపరుడూ, న్యాయమూర్తీనూ. ఆయనకు అన్ని విధాలా తగిన మంత్రి సుబుద్ధి. రాజ్య తంత్రం నడిపించి ప్రజలకు మేలు చేయటంలో అద్వితీయమైన ప్రతిభ కలవాడు.

## బేతాళ కథలు



సత్యజిత్తు మహారాజుకు కమలాకరుడనే ఒక కొడుకు ఉన్నాడు. అతను అన్నివిధాలా తండ్రికి విరుద్ధం. మొదటి నుంచీ చెడ్డ సాంగత్యాలు మరిగి, చెడ్డ అలవాట్లు నేర్చుకున్నాడు. తాను బొత్తిగా హద్దు మీరి పోకుండా మంత్రి అయిన సుబుద్ధి కట్టుదిట్టాలు చేస్తూ రావటంవల్ల కమలాకరుడికి సుబుద్ధి అంటే చెప్పలేనంత ద్వేషం ఏర్పడి, క్రమంగా వృద్ధి అవుతూ వచ్చింది. తాను ఏ క్షణాన రాజైతే ఆ క్షణాన సుబుద్ధిని నిర్మూలింతామని నిశ్చయించుకున్నాడు.

కొంత కాలానికి ఆ క్షణం రానే వచ్చింది. సత్యజిత్తుడు వృద్ధాప్యంలో వ్యాధిగ్రస్తుడై, ఒక వంక తన కొడుకు దుర్వర్తన మనే వ్యాధి కాగా, అవసాన దశకు చేరుకున్నాడు. తన అనంతరం సుబుద్ధి అంకుశంలాగా ఉండని పక్షంలో తన కొడుకు ఎందుకూ కొరగాకుండా పోతాడనే ఉద్దేశంతో ముసలి రాజు సుబుద్ధికి అంతులేని అధికారా లిచ్చి, తన కొడుకును మంచి దారిలో పట్టుకు రమ్మని హెచ్చరించి ప్రాణాలు వదిలాడు.

తన తండ్రి చచ్చిపోయి తనకు రాజ్యప్రాప్తి కలిగినాక కూడా సుబుద్ధి బెడద తగ్గక పోవటం కమలాకరుడికి మండిపోయింది. సుబుద్ధి పై అతని కుండిన ద్వేషం రెట్టింపయింది. తన తండ్రి సుబుద్ధికి ఎలాటి అధికారాలు ఇచ్చి చనిపోయినదీ రాజుగారి కొలువులో ఉండే వారి కందరికీ తెలుసు. ఆ అధికారాల సాకుతో ఆ సభికుల సమక్షంలోనే సుబుద్ధిని నిర్మూలించాలని కమలాకరుడు ఒక ఉపాయం పన్నాడు.

రాజుగారి ఉత్తరక్రియలు మొదలైనవి ముగియగానే ఒక సుముహూర్తాన సుబుద్ధి కమలాకరుడికి ఘనంగా రాజ్యాభిషేకోత్సవం జరిపించాడు. ఆ కర్మకాండ పూర్తికాగానే కమలాకరుడు నిండు కొలువుతీరి సభికులతో, "సుబుద్ధి చాలా కాలంగా మా తండ్రిగారికి ప్రధాన మంత్రిగా పని చేశారు. ఆయన

మహా మేధావి అని అందరూ చెప్పుకోగా విన్నాను, కాని నా కాయన తెలివి తేటలను గురించి ఏమీ తెలియదు. అందుచేత ఆయన తెలివి తేటలను పరీక్షించటానికి ఒక చిన్న ఏర్పాటు చేశాను. ఈ భరిణలో రెండు మడిచిన చీటీ లున్నాయి. మడతలు చూస్తే రెండూ ఒక్కటిగానే ఉంటాయి. అయితే వాటిలో ఒక దాని పైన "అవును" అనీ, రెండవదాని పైన "కాదు" అనీ రాసి ఉంది. సుబుద్ధిగారు ఈ భరిణ నుంచి "అవును" అని రాసి ఉన్న చీటీ తీసి నట్టయితే ఈయన బుద్ధి కుశలుడని ఒప్పు కుంటాను. లేని పక్షంలో ఈయనను మంత్రి పదవి నుంచి తొలగించటమేగాక, మా తండ్రిగారిని దీర్ఘ కాలం మోసగించినందుకు నాకు తోచిన శిక్ష కూడా విధిస్తాను. ఈ పరీక్షకు మంత్రిగారు ఒప్పుకున్నా సరే! లేదా, మంత్రి పదవికి తాము తగమని నిండు సభలో ఒప్పేసుకుని, సకుటుంబంగా దేశం విడిచి పోయినా సరే! ఇందుకు మంత్రి గారేమంటారు?" అని అడిగాడు.

సభలోని వారంతా నిశ్చేష్టులైపోయారు. కొత్త రాజుకు సుబుద్ధి పై గల ద్వేషభావం అందరికీ అర్థమైపోయింది. ఇలాటి నీచ మైన పరీక్షకు తల ఒగ్గి సుబుద్ధి తన



ప్రాణాల మీదికి తెచ్చుకోడనీ, సకుటుంబంగా దేశం వదలి వెళతాడేగాని, ఇష్టంలేని రాజు కింద మంత్రిగా ఉండే అవకాశం కోసం జూదం ఆడడనీ అందరూ గట్టిగా నమ్మారు.

అయితే సుబుద్ధి, "మహారాజుగారు చెప్పిన పరీక్షకు ఒప్పుకుంటాను," అని అందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచాడు.

కమలాకరుడు సుబుద్ధి కేసి ఒక్కసారి నిప్పులు కక్కుతూ చూసి, భరిణ మూత తీసి, "చీటీ తీయండి," అన్నాడు. సుబుద్ధి ఒక చీటీ తీసి, దాన్ని విప్పి చూడకుండానే చించి ముక్కలు ముక్కలు చేసి కింద పారే శాడు. సభలో గొప్ప కలవరం చెలరేగింది.



"మహామంత్రిగారు తాము తీసిన చీటీలో ఏ మున్నదీ ఎవరికీ చూపలేదు, తామైనా చూడలేదు!" అని కొందరన్నారు.

"రెండవ చీటీ భరిణలో ఉన్నది కద. దాన్ని చూస్తే నేను తీసిన చీటిలో ఏమున్నదీ తెలియదా?" అన్నాడు సుబుద్ధి. భరిణలో మిగిలిపోయిన చీటీ విప్పి చూడగా అందులో "కాదు" అని ఉన్నది.

కమలాకరుడు అందరినీ నిశ్శబ్దంగా ఉండమని సంజ్ఞ చేసి, "నేను పెట్టిన ఈ పరీక్షలో మహామంత్రి నెగ్గారు. వారి కంటె నాకు మంచి మంత్రి దొరకరు. వారినే నాకు కూడా మంత్రిగా ఉండి రాజ్య తంత్రభారం వహించ వలిసిందిగా కోరు తున్నాను," అన్నాడు. అందరూ హర్షించారు. అది మొదలు కమలాకరుడు సుబుద్ధి సలహాను తూచా తప్పకుండా పాలిస్తూ, గొప్ప ధర్మప్రభువనిపించుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఇందులో నాకు అర్థంకాని అంశాలు చాలా ఉన్నాయి. నా సందేహాలు ఒక టొకటిగా చెబుతాను. సుబుద్ధి లాటి మేధావి తనపై ద్వేషంగల రాజును వదిలి వెళ్ళిపోక నీచమైన ఆ పరీక్షకు ఎందుకు ఒప్పుకున్నాడు? మంత్రిత్వ కాంక్ష చేతనా? అది అలా ఉంచు. తాను సరి అయిన చీటీ తీయగలనన్న ధైర్యం సుబుద్ధికి ఎలా కలిగింది? అలాటి ధైర్యం ఉండబట్టేకదా తాను తీసిన చీటీని చూడనైనా చూడకుండా చించి పారేశాడు? ఆయన కేమైనా దివ్యదృష్టి ఉన్నదా? మూడవ సందేహం: కమలాకరుడికి సుబుద్ధి పై పరీక్షా సమయందాకా ఉండిన ద్వేషమంతా ఏమయింది? అతను సుబుద్ధి సలహాకు కట్టుపడి రాజ్యం చెయ్యటానికి కారణమేమిటి? సుబుద్ధికి వశీకరణ విద్య ఏమైనా తెలుసునా? ఈ సందేహాలన్నిటికీ సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు ఇలా చెప్పాడు:

"కమలాకరుడు తనను నిర్మూలించటానికే పరీక్ష అన్నది ఒక హీనమైన సాకుగా పెట్టాడని సుబుద్ధి ఎరుగును. అందుకని ఆయన సకుటుంబంగా రాజ్యం విడిచి వెళ్ళిపోతే చనిపోయిన రాజు కిచ్చిన మాట తప్పిన వాడవుతాడు. కమలాకరుణ్ణి సరి అయిన మార్గాన నడిపించమని ముసలి రాజు కోరాడుగద! తాను సరి అయిన చీటీ తీయ గలుగుతానని సుబుద్ధి అనుకోలేదు. ఎందుకంటే ఏ చీటీ తీసినా అది తప్పుడు చీటీయే అవుతుంది. సుబుద్ధిని నిర్మూలించటమే కమలాకరుడి ఆశయమైనప్పుడు—అతను పెట్టిన పరీక్ష కేవలమూ నామ మాత్రమే అయినప్పుడు-రెండు చీటీలపైనా "కాదు" అనే రాసి ఉంటుంది. ఈ సంగతి మేధావి అయిన సుబుద్ధికి తెలియక పోలేదు. అందుచేతనే ఆయన దానిని విప్పి చూడకుండా చించి పారేశాడు. ఇలా చేయటంలో అతను తనను తాను కాపాడుకోవటం కన్న హెచ్చుగా రాజైన కమలాకరుడి ప్రతిష్ఠను కాపాడాడు. రెండు చీటీల పైనా "కాదు" అనే రాసి ఉన్నట్టు సుబుద్ధి అవలీలగా రుజువు చేసి ఉండును. అలా చేయటంవల్ల కమలాకరుడికి రాజ్యాభిషేకం నాడు ఏర్పడిన కళంకం చచ్చినదాకా నిలిచే ఉండును. అలా తనను సుబుద్ధి కాపాడాడని తెలియటంతో కమలాకరుడిలో హృదయ పరివర్తన కలిగింది. తాను చెడ్డ పనులు చేయకుండా మాత్రమే ఇదివరలో సుబుద్ధి నివారిస్తూ వచ్చాడు. ఆయన తనలోని కుళ్ళును కూడా కప్పి పెట్టగలడని తెలియగానే కమలాకరుడు సుబుద్ధికి మనస్ఫూర్తిగా లొంగిపోయాడు."

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై చెట్టెక్కాడు. [శ్రీ ఎన్. లక్ష్మినారాయణ (టిటఘర్) రచన ఆధారంగా]



# మజ్నూ ప్రేమ  [రామతీర్థ కథ]

మజ్నూ ప్రేమ ఆదర్శ ప్రేమగా చెబుతారు. అతను తన ప్రియురాలి కొరకు తపించి పిచ్చివాడై పోయాడు. ఆమె కోసం చెట్లూ, పుట్టలూ పట్టి తిరిగాడు. ప్రతి చెట్టులోనూ, జంతువులోనూ అతనికి తన ప్రియురాలు కనిపించింది.

చివరకు మజ్నూ అరణ్యంలో మూర్ఛ పోయాడు. అక్కడికి అతని తండ్రి వచ్చి, అతని మొహం తుడిచి, "నాయనా, నన్ను గుర్తించావా ?" అని అడిగాడు. కాని మజ్నూకు ప్రపంచంలో తన ప్రేయసి తప్ప ఇంకేమీ లేదు. అతను తన తండ్రినే గుర్తించక తేరి పార చూశాడు.

"నేను నీ తండ్రినిరా, బాబూ," అన్నాడు తండ్రి.

"తండ్రి అంటే ఎవరు ?" అని మజ్నూ అడిగాడు. మజ్నూ చనిపోయి దేవుడి వద్దకు వెళ్లాడు. దేవుడు అతనితో, "మూఢుడా, నీవు నీ ప్రేయసిని ప్రేమించిన దానిలో సహస్రాంశం నన్ను ప్రేమించి ఉంటే నీకు దేవత్వం ఇచ్చి వుందునుగద !" అన్నాడు.

మజ్నూ దేవుడితో, "ఈ మాట అన్నందుకు నిన్ను క్షమిస్తున్నాను. నీవు నా ప్రేమారాధనలు కోరినవాడవైతే నా ప్రియురాలి రూపంలో వచ్చి ఉండవలిసింది," అన్నాడు.








# అర్థంకాని ఉపదేశాలు

పిల్లల సంభాషణ విని లోపలికి వస్తున్న తాతయ్య నిర్ఘాంతపోయాడు. వాళ్ళు జీవాత్మ, పరమాత్మ, మనో బుద్ధి చిత్తా హంకారాలూ, పంచతన్మాత్రలూ, కుండలినీ యోగమూ మొదలైన మాటలు ఉప యోగిస్తూ అడ్డదిడ్డంగా తమలో తాము మాట్లాడుకుంటున్నారు.

"ఏమిటిరా మీరు మాట్లాడేదీ?" అని అడిగాడు తాతయ్య.

"అమ్మమ్మ వెంట మేం కూడా స్వాము లార్ని చూడబోయాం, తాతయ్యా. స్వాము లారి ఉపదేశం విన్నాం," అన్నారు పిల్లలు.

"ఉపదేశం మీకు అర్థమయిందిట్రా?" అని అడిగాడు తాతయ్య.

"కాలేదనుకో—" అని పెద్దవాడు నసిగాడు.

"శ్లోకాలు అస్సలు అర్థం కాలేదు, తాతయ్యా," అన్నాడు రెండోవాడు.

"కోమటి రామేశం కొడుకులాగా అర్థం కాని ఉపదేశాలు విన్నారన్నమాట!" అన్నాడు తాతయ్య, పొట్ట ఎగిరేలా నవ్వుతూ.

"రామేశం ఎవరు, తాతయ్యా?... ఆయన కొడుకు ఏం చేశాడు, తాతయ్యా?... ఏం ఉపదేశాలు, తాతయ్యా?...ఏ స్వాము లారు ఉపదేశాలు చేశాడు, తాతయ్యా?" అని పిల్లలు జలగల్లా తాతయ్యను గట్టిగా పట్టుకున్నారు.

భోజనానికింకా వేళ కాలేదని తెలుసు కుని తాతయ్య కథ చెప్పటానికి కుర్చీలో కూచున్నాడు. పిల్లలు చుట్టూ కూచున్నాక తాతయ్య పొడుం ఒక పట్టు పీల్చి, ఈ విధంగా ప్రారంభించాడు:

ఒక ఊళ్ళో రామేశం అని ఒక కోమటి ఉండేవాడు. చాలా ధనవంతుడు. వర్తకం ఉండేది. దీనికి తోడు రామేశం తర్క వ్యాకరణాలలో గొప్ప పండితుడు. మాట

మట్లాడాడంటే అందులో ఎంతో గూఢార్థం ఉండేది. అందుచేత ఆయనతో మాట్లాడి ఆనందించటానికి గొప్ప గొప్ప పండితులు వస్తూండేవారు.

అయిందా, ఈ రామేశానికి ఒక కొడుకుండేవాడు. వాడి పేరు కామేశం. ఎందుచేతనో వాడికి తండ్రి తెలివితేటలూ ప్రయోజకత్వమూ అబ్బలేదు. మామూలు చదువు చదివాడు. వ్యాపారంలో అనుభవం పొందటానికి తండ్రి ఏం చెబితే అది చేస్తూ ఉండేవాడు. తండ్రి వాడికి వ్యాపార రహస్యాలేమీ చెప్పలేదు; పై పనులు మాత్రమే చెప్పి చేయించుకునేవాడు. తెలివితేటలు అంతగా లేకపోయినా కామేశానికి తండ్రి మాట అంటే ఎంతో గౌరవం. ఏ పని చెప్పినా, చెప్పినది చెప్పినట్టు చేసుకుపోతూండేవాడు.

ఇలా కొంతకాలం గడిచాక ఏమయిందీ, రామేశం జబ్బు చేసి మంచం పట్టాడు. లక్షాధికారి గనక వైద్య సహాయానికేమీ లోటు జరగలేదు. అయినా రోగం తిరుగు ముఖం పట్టలేదు. ఇక తాను బతకనని తోచగానే రామేశం కామేశాన్ని పిలిచి, "నాయనా, నీకు మన వ్యాపారం గురించి అంతా తెలుసుగాని క్రయవిక్రయాల రహస్యం



నీ కెన్నడూ చెప్పలేదు. అది ఇప్పుడు చెబుతున్నాను విను. ఎక్కువకు కొని తక్కువకు అమ్ము. అలా చేస్తే వ్యాపారం వృద్ధి అవుతుంది," అన్నాడు. ఆ తరవాత కొద్ది సేపటికే రామేశం ప్రాణాలు విడిచాడు.

తండ్రి పోగానే బరువంతా కామేశం మీద పడింది. వాడు తండ్రి చెప్పిన మాట ఆలోచించాడు. ఎక్కువ ధరకు కొని తక్కువ ధరకు అమ్మమని కదా తండ్రి చెప్పాడు. అలా అమ్మితే నష్టం వస్తుందని ఎంత మూఢుడికైనా తెలుస్తుంది. కామేశం పెద్ద తెలివితేటలు కలవాడు కాకపోయినా, వ్యాపారం లాభసాటిగా సాగాలంటే తక్కువ



ధరకు కొని ఎక్కువ ధరకే అమ్మాలని ఎరుగును. అయినప్పటికీ వాడు తండ్రి మాట మీద గౌరవం కలవాడవటంచేత, ఆయన చనిపోతూ ఉపదేశించిన ప్రకారం హెచ్చు ధరకు సరుకుకొని తక్కువ ధరకు అమ్మసాగాడు. ఇంకేముందీ? అమ్మకం విపరీతంగా సాగింది. దానితోబాటు అంతు లేని నష్టమూ వచ్చింది. ఏడాది తిరక్క ముందే కామేశం యావదాస్తీ పోగొట్టుకుని, శెట్టి మిగిలాడు.

ఇక ఏం చెయ్యాలో కామేశానికి తెలియ లేదు. ఇల్లు ఖాళీ అయింది, భోషాణం ఖాళీ అయింది. ఇనప్పెట్టెలో పాత కాగితాలు మిగిలాయి. వాటిని తిరగ వేస్తుండగా అందులో ఒక ఉత్తరం దొరికింది. అది తన తండ్రి తన కోసం రాసినది. అందులో ఏమున్నదంటే—"లక్ష్మి కాలవాహనుల మధ్య తవ్వినట్టయితే నిధి దొరుకును," అని ఉన్నది.

ఈ ముక్క కామేశానికి మొదలే అర్థం కాలేదు. లక్ష్మి కాలవాహనులు ఎక్కడ ఉంటారు? వారి మధ్య ఎలా తవ్వాలి? కామేశం ఊళ్ళో ఎందరో పండితుల వద్దకు వెళ్ళి, "అయ్యా, లక్ష్మి కాలవాహనుల మధ్య తవ్వితే నిధి దొరుకుతుందని మా నాన్నగారు పత్రంలో రాసి ఉంచాడు. లక్ష్మి కాలవాహనులు ఎక్కడుంటారో తమరేమైనా చెప్పగలరా?" అని అడిగాడు. ఎవరూ చెప్పలేకపోగా, "డబ్బు పోవటంతో వీడికి ఉన్న మతి కూడా పోయింది గాబోలు, పాపం!" అనుకున్నారు. అసలు వాడు కొన్న ధర కన్న తక్కువగా అమ్మకం చేసినప్పుడే వాణ్ణి చూసి పిచ్చివాడనుకున్నారు. అసలే పిచ్చివాడు, అందులోనూ బికారి కూడా అయాడంటే మతి పూర్తిగా పోవటంలో ఆశ్చర్యం ఏముందీ?

ఏం చెయ్యాలో తోచక కామేశం నిస్పృహ చెంది ఉండగా వాళ్ళ ఇంటి కొకనాడు

దూర ప్రాంతం నుంచి ఒక తర్క పండితుడు వచ్చాడు. ఆయన రామేశం బతికున్న రోజుల్లో ఒకటి రెండుసార్లు వచ్చి, ఆయన పాండిత్యాన్ని మెచ్చుకుని ఆనందించిన వాడే. అయితే రామేశం పోయిన సంగతి ఆయనకు తెలియక వచ్చాడు. రామేశం పోయాడన్నందుకు ఒక విచారమూ, ఆయన కొడుకు దరిద్రుడై పోయాడన్నందుకు మరొక విచారమూ ఆయనను బాధించాయి. "అంత ఆస్తి ఇంత శీఘ్ర కాలంలో ఎలా పోయింది, నాయనా?" అని ఆ పండితుడు కామేశాన్ని అడిగాడు.

"మా నాన్నగారు చనిపోతూ సరుకు హెచ్చు ధరకు కొని తక్కువ ధరకు అమ్మమన్నారు. అలాగే చేశాను. నష్టం వచ్చింది. నష్టం రాక ఏమవుతుందీ?" అన్నాడు కామేశం.

పండితుడు ముక్కు మీద వేలేసుకుని, "ఓరి, వెర్రివాడా! నీకు మీ నాయనగారు చెప్పిన సలహా కొంచెం కూడా అర్థం కాలేదా? వ్యాపారం చేసుకునే వాడెవడైనా సరుకు కొన్న ధర కన్న తక్కువ ధరకు విక్రయిస్తాడా? ప్రాణాలు విడిచే సమయంలో మీ తండ్రిగారు నీకు అంత అర్థంలేని సలహా ఇస్తారని నీ వెలా అనుకున్నావు?" అన్నాడు.



"అయితే ఆయన ఉద్దేశం ఏమిటంటారు?" అని అడిగాడు కామేశం తెల్ల ముఖం వేసి.

"కొనేటప్పుడు ఒకరి కన్న హెచ్చు ధర పెట్టి కొనమనీ, అమ్మేటప్పుడు ఒకరి కన్న తక్కువ ధరకు అమ్మమనీ ఆయన ఉద్దేశం. అలా చేసినట్టయితే క్రయవిక్రయాలు రెండూ చురుకుగా సాగుతాయి చూడూ!" అన్నాడు పండితుడు.

తండ్రి చేసిన ఉపదేశం కామేశాని కిప్పు డర్థమయింది. వాడు వెంటనే లేచి వెళ్ళి తన తండ్రి ఏనాడో రాసి ఉంచిన పత్రం తెచ్చి ఆ పండితుడికి చూపి, "దీనికి కూడా అర్థం ఏమిటో చెబుదురూ! నేను బాగుపడి పోతాను," అన్నాడు.

పండితుడు ఆ పత్రంలో ఉన్న వాక్యం చదివి, "మీ ఇంట ఆవులూ, గేదెలూ ఉన్నాయి కదూ?" అన్నాడు.

"అన్నీ అమ్మేశాను," అన్నాడు కామేశం.

"అవి ఎక్కడ ఉండేవో చూపించ గలవా?" అన్నాడు పండితుడు.

కామేశం ఆయనను పెరటి పక్కకు తీసుకుపోయి, "ఈ కొట్టంలో ఆవు లుండేవి, ఈ కొట్టంలో గేదె లుండేవి," అన్నాడు.

"రెండు కొట్టాల మధ్యా తవ్వించు, నిధి దొరుకుతుంది. లక్ష్మి అంటే ఆవు, కాలవాహన మంటే ఎనుము, తెలిసిందా?" అన్నాడు పండితుడు.

కామేశం అలాగే తవ్వించేసరికి పెద్ద నిధి దొరికింది. ఆయన ఆ పండితుడికి పుష్కలంగా సువర్ణదానం చేసి పంపేసి, మిగిలిన డబ్బుతో మళ్ళీ వ్యాపారం సాగించి, పోగొట్టుకున్న దానికి రెట్టింపు సంపాదించుకున్నాడు.

"అందుచేత నేమిటంటే, ఉపదేశాలు వినగానే సరికాదు, వాటిని అర్థం చేసుకోవాలి," అన్నాడు తాతయ్య.

శ్రీ ఏ. వి. శేషాద్రి (గుడియాత్తం)
కథ ఆధారంగా.





# ఎవరుపెట్టాలి? ఎవరుతినాలి?

భీమన్న చేత అవమానం పొందిన వెంకటప్ప తాచుపాములాటి స్వభావం కలవాడు. భీమన్న పైన ప్రతీకారం చెయ్యాలని వాడికి బాగా పట్టుకున్నది. జమీందారుగారి ఇంటి నుంచి తనను భీమన్న సాగనంపిన పద్ధతి ఊరంతా తెలిసిపోయింది. ఇక తాను ఊళ్ళో తల ఎత్తుకు తిరగటం సాధ్యంకాదు.

అందుచేత వెంకటప్ప తన కొడుకును సుబ్బన్నను పిలిచి, "ఒరే, నేను కొంత కాలం పొరుగూరులో ఉండి వస్తాను. ఈలోగా నువు భీమన్నను అత్తవారింటి నుంచి వెళ్ళగొట్టాలి. జమీందారు పైనా, భీమన్న పైనా నా పగ తీరాకనే నేను మళ్ళీ ఈ ఊళ్ళో అడుగు పెట్టటం," అన్నాడు.

"ఏం చెయ్యాలో చెప్పు, నాన్నా. నువు చెప్పినట్టే చేస్తాను," అన్నాడు సుబ్బన్న.

వాడికి తండ్రి రహస్యంగా చెయ్యవలసినది చెప్పి పొరుగూరికి వెళ్ళిపోయాడు.

సుబ్బన్నకూ భీమన్నకూ కొద్దిపాటి స్నేహం ఉన్నది. అందుచేత వాడు భీమన్న దగ్గిరికి వెళ్ళి, "జమీందారుగారి అల్లుడు కావటం నీకెంత అపకారమయిందో తెలుసా? ఊళ్ళో అందరూ నిన్ను చూసి హేళన చేస్తున్నారు," అన్నాడు.

"హేళన చెయ్యటానికి నేనేం చేశాననీ?" అని భీమన్న అడిగాడు.

"ఏమీ చెయ్యక పోవటమే నీ లోపం! పరువైన మగవాడెవడూ భార్య పెడితే తింటూ కూచోడు. ఏదైనా పని చేసి, తాను తిని భార్యకు పెడతాడు. నువు అలా చెయ్యక నీ భార్య వండి వడ్డిస్తే తింటూ కూచున్నావు. నీలాటి వాణ్ణి చూసి అందరూ నవ్వుతారు మరి," అన్నాడు సుబ్బన్న.

సుబ్బన్న చెప్పినట్టు తాను భార్య వడ్డిస్తే తినటమే కాని భార్యకు ఏనాడూ భోజనం పెట్టలేదు. ఏనుగుకున్నంత బలం ఉండి



కూడా తాను పనీపాటూ చెయ్యాని మాటా నిజమే. అలా ఉండటం పరువైన సంగతి కాదని సుబ్బన్న చెబుతున్నాడు. నిజమే అయి ఉండాలి. అందుకే చిన్నప్పుడు బామ్మ తన చేత పని చేయించటానికి ఎన్నో ప్రయత్నాలు చేసింది. చేసేటందుకు పని దొరక్కపోదు. వంట చెయ్యటం బామ్మ దగ్గిర నేర్చుకుని వస్తే, ఆ తరవాత ఏదో ఒక పని సంపాదించి, తానుకూడా పరువుగా తన భార్యకు తిండి పెట్టవచ్చునను కున్నాడు భీమన్న.

భీమన్న మహలక్ష్మితో, "నేను మా బామ్మ దగ్గిరికి వెళ్ళి వస్తాను," అన్నాడు.

"ఏమిటి విశేషం?" అని మహలక్ష్మి అడిగింది.

"వంట చేయటం నేర్చుకోవాలి," అన్నాడు భీమన్న.

"వంట నేర్చుకోవాలని సరదాగా ఉంటే నేను నేర్పుతాగా?" అన్నది మహలక్ష్మి పెద్దగా నవ్వుతూ.

"అది పరువుగా ఉండదు. నేను వంట నేర్చుకున్న దాకా ఈ వూళ్ళో ఉండరాదు. అందరూ నన్ను చూసి నవ్వుతున్నారు," అన్నాడు భీమన్న.

తన భర్త తలలో ఏదో వెర్రి ఆలోచన తల ఎత్తిందని గ్రహించి మహలక్ష్మి అతన్ని ప్రశ్నించింది. ఆ ప్రశ్నల కన్నిటికీ సమాధానాలు చెబితే ఆమె తన ప్రయత్నం కాస్తా పడగొట్టుతుందనుకుని భీమన్న, "నన్నేమీ అడగకు. నా పని ముగించుకుని గాని నేను ఈ ఊళ్ళో అడుగు పెట్టను," అన్నాడు.

మహలక్ష్మి మాట్లాడక ఊరుకుని అతన్ని వెళ్ళిపోనిచ్చింది. అల్లు డెక్కడ అని జమీందారుగా రడిగితే, "వాళ్ళ బామ్మను చూసి వస్తానని వెళ్ళారు," అని చెప్పింది.

భీమన్న బయలుదేరి భోజనాల వేళకు ఒక గ్రామం చేరాడు. జమీందారుగారి అల్లుడు వచ్చాడు గదా అని గ్రామపెద్ద

అతనికి తన యింట ఆతిథ్యమిచ్చాడు. గ్రామపెద్దతోబాటు భీమన్న కూచున్నప్పుడు గ్రామపెద్ద భార్య వడ్డన చేసింది. భోజనం చేస్తూ భీమన్న, "మీ ఇంట్లో వంట ఎవరు చేస్తారు?" అని అడిగాడు.

"నా భార్యే చేస్తుంది. వంట బాగా లేదా?" అని గ్రామపెద్ద భీమన్నను అడిగాడు.

"చాలా బాగుంది. ఎప్పుడూ ఆమే చేస్తారా? మీరు చెయ్యరా? ఆ మాట తెలుసుకోవటానికి అడిగాను," అన్నాడు భీమన్న. గ్రామపెద్ద ఆశ్చర్యంతో, "నేను వంట చెయ్యటమా? ఎన్నడూ లేదు. నా కసలు వంట చెయ్యటమే రాదు," అన్నాడు.

భీమన్నకు ఆశ్చర్యమయింది: "గ్రామ పెద్ద అయి ఉండికూడా భార్యకు తిండి పెట్టక, భార్య పెడితే తింటున్నాడా?" అనుకున్నాడు.

అక్కడి నుంచి బయలుదేరి భీమన్న ఆ రాత్రికి మరొక గ్రామం చేరాడు. అక్కడి గ్రామాధికారి భీమన్నకు ఆతిథ్యమిచ్చాడు. ఇక్కడకూడా అలాగే జరిగింది. గ్రామాధికారి భార్య వడ్డించింది. తనకు వంట చాతకాదనీ, తానెప్పుడూ వంట చెయ్యలేదనీ, కాపరానికి వచ్చిన నాటి నుంచీ తన భార్యే




రెండు పూటలా వంట చేస్తున్నదనీ గ్రామాధికారి స్పష్టంగా చెప్పాడు.

భీమన్నకు మండిపోయింది. సుబ్బన్న తనతో ఎందుకు అబద్ధం చెప్పాడు? ఆ సంగతి ముందు తేల్చుకోవాలి!

భీమన్న బొమ్మను చూసే ప్రయత్నం కట్టిపెట్టి, మర్నాడు తెల్లవారుజామునే లేచి తన ఊరికి తిరిగి వెళ్ళి, తిన్నగా సుబ్బన్న ఇంటికి పోయాడు. అప్పుడే సుబ్బన్న భోజనానికి కూచున్నాడు, వాడి భార్య వడ్డన చేస్తున్నది.

"ఏమిరా, సుబ్బన్నా? నాతో అబద్ధ మాడతావా? మగవాళ్ళెవరూ భార్యలకు

వండిపెట్టటం లేదు. నేను చూసి వచ్చాను. ఆఖరుకు నువు కూడా నీ భార్య వడ్డిస్తేనే తింటున్నావు గాని నీ భార్యకు తిండి పెట్టటం లేదు. నన్ను హేళన చేసిన వాళ్ళెవరో చూపించు," అని భీమన్న సుబ్బన్నను గద్దించి అడిగాడు.

"నే నన్నది అది కాదు, భీమన్నా—" అని సుబ్బన్న ఏదో చెప్పబోయేసరికి భీమన్న, "పరువు గల మగవాళ్ళందరూ భార్యలకు తిండి పెడతారని నువు చెప్ప లేదా? ఇప్పుడు మాట మార్చుతున్నావా?" అంటూ సుబ్బన్న జుట్టు పట్టుకున్నాడు. భీమన్న తనను చంపేస్తాడని భయపడి సుబ్బన్న కేకలు పెట్టాడు.

చుట్టుపక్కల వాళ్ళంతా చేరారు. సంగ తంతా విని వాళ్ళు భీమన్నతో, "సుబ్బన్న మాటకు అర్థం, మొగుడు భార్యను పోషించ టానికి ఏదన్నా ఉద్యోగం చెయ్యాలని," అని నచ్చ చెప్పారు.

"సుబ్బన్న అట్లా చెప్పగూడదూ? పెళ్లా లకు తిండి పెట్టాలనటం దేనికి? ఉద్యోగం చెయ్యాలంటే సరిపోయేది కదా?" అని రుసరుసలాడుతూ ఇంటికి వెళ్ళాడు భీమన్న.

మహలక్ష్మి భీమన్నతో "మీ బామ్మగారి ఊరు వెళ్ళలేదా?" అన్నది.

"ఆ సుబ్బన్న నాతో అబద్ధాలు చెప్పాడు. నేను వంట నేర్చుకో నక్కర్లేదుట. ఉద్యోగం చెయ్యాలిట!" అన్నాడు భీమన్న.

"జమీందారీ వ్యవహారాలు చూడటం ఉద్యోగం కాదా? లేనిపోని అనుమానా లన్నీ పెట్టుకోక భోజనానికి లేవండి, వడ్డిస్తాను," అన్నది మహలక్ష్మి.

మహలక్ష్మికి తాను వండి పెట్టనవసరం లేకుండా, ఆమె వంట తాను తినవచ్చు గదా అని పరమానందం పొంది భీమన్న భోజనానికి లేస్తూ, "ఇక నుంచీ జమీందారీకి సంబంధించిన పనులన్నీ నాకు చెప్పు. నేనే చేసేసి పరువు సంపాదిస్తాను," అన్నాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 6

చక్రవర్తి కుమార్తెను చూస్తూనే మూర్ఛపోయిన హసన్‌ను వృద్ధ యోధకన్య సేదదేర్చి, అతని వికారానికి కారణ మడిగింది.

"ఈమె ముమ్మూర్తులా నా భార్యే కాని, నా భార్య మాత్రం కాదు!" అన్నాడు హసన్ ఆవేదనతో.

ఈ మాటకు చక్రవర్తి కూతురు పగలబడి నవ్వి, "ఈ మనిషికి నిశ్చయంగా పిచ్చే! ఏమోయ్? నీ మాటలను బట్టి చూస్తే నీ భార్యకూ నాకూ చాలా పోలికలున్నట్టున్నది. కొంత తేడా కూడా ఉన్నట్టున్నది. పోలికలేవి? తేడా ఎందులో?" అని అడిగింది.

"మహరాణీ, మీకూ నా భార్యకూ ఏ అవయువంలోనూ తేడాలేదు. కాని మీ ఇద్దరికీ తేడా ఉన్నది. దాన్ని నేను గ్రహించగలను గాని వివరించలేను," అన్నాడు హసన్. ఈ మాటతో చక్రవర్తి కుమార్తెకు రెండు విషయాలు స్పష్టంగా తెలిసిపోయాయి—ఈ అందగాడి మనసు తన కేసి రాదు; ఇతని భార్య తన ఆరుగురు చెల్లెళ్ళలోనూ ఒకతె అయి ఉండాలి. ఆమెకు హసన్‌పైనా, అతని ప్రేమకు పాత్రురాలైన తన చెల్లెలిపైనా పట్టరాని ఈర్ష్యా, కోపమూ పుట్టుకొచ్చాయి. తన చెల్లెళ్ళలో ఇతని భార్య ఎవరో తేల్చుకుని, దాన్నీ ఇతన్నీ కూడా క్రూరంగా శిక్షించటానికి ఆమె నిశ్చయించుకున్నది.

ఆమె ముసలిదాని కేసి తిరిగి, "ఓసీ, నీవు ఇక్కడున్నట్టుగా మిగిలిన ఆరు దీవులకూ వెళ్ళి, నా ఆరుగురు చెల్లెళ్ళనూ పిలుచుకు రా. వాళ్ళను చూసి రెండేళ్ళు

సి. మాధవరావు



దాటింది. వాళ్ళను చూడగోరుతున్నానని చెప్పు. చెప్పి నీ వెంట తీసుకు రా. ఈ యువకుడి సంగతి ఏమీ చెప్పకు సుమా!" అన్నది.

ముసలిదానికి తన యజమానురాలి ఎత్తు అర్థం కాలేదు. అందుచేత ఆమె అతి శీఘ్రంగా ఒక్కొక్క దీవికే వెళ్ళి, ఒక్కొక్క చక్రవర్తి కుమార్తెనూ వెంట తీసుకుని, చక్రవర్తి ఆఖరు కుమార్తె వద్దకు వచ్చింది. హసన్ భార్య ఈ కుమార్తే. ఈమె పైన గల మమకారంతో గంధర్వ చక్రవర్తి ఈమె దగ్గిరే ఉంటున్నాడు.

తన కడగొట్టు కూతురు వెళ్ళి పోవటానికి ఆయన అభ్యంతరం చెప్పాడు. తనకేవో దుశ్శకునాలు కనిపించాయని చెప్పి ఆయన తన చిన్న కుమార్తెను వెళ్ళవద్దన్నాడు.

"నా కోసం మా అక్క నూరల్‌హుదా విందు సిద్ధం చేసి పిలిపిస్తే వెళ్ళకుండా ఎలా, నాన్నా? నే నామెను చూడబోయి రెండేళ్ళయింది. ఇప్పుడు కూడా రానంటే ఆమెకు కోపం వస్తుంది. నా కేమీ భయం లేదు. ఒకప్పుడు నేను చాలా కాలం కనిపించకపోతే ఏమయానో అని నీవు దిగులు పడ్డావు. అయినా నేను తిరిగి వచ్చాను కానా? అలాగే ఈసారి కూడా వస్తాను. అందులోనూ ఈసారి దూరం వెళ్ళటం లేదాయె, మన దీవులలోనే కద! నీకేమీ సంకోచం వద్దు!" అన్నది హసన్ భార్య తన తండ్రి అయిన గంధర్వ చక్రవర్తితో.

ఆమె తన అక్క వద్ద కొద్ది రోజులు మాత్రమే ఉండి తిరిగివచ్చే షరతు మీద తండ్రి ఆమె వెళ్ళటానికి అనుమతించాడు. ముసలిది అరుగురు అప్ప చెల్లెళ్ళనూ వెంట పెట్టుకుని నూరల్‌హుదా వద్దకు బయలుదేరింది. తన చెల్లెళ్ళు వచ్చే లోపుగా నూరల్‌హుదా ప్రత్యేకమైన దుస్తులూ నగలూ ధరించి, మెరిసిపోతూ సింహాసనం పైన ఠీవిగా కూచున్నది. ఆమె కెదురుగా హసన్ దీనవదనంతో నిలబడి

ఉన్నాడు. అతన్ని యోధకన్యలు విచ్చు కత్తులతో కాస్తున్నారు.

ముసలిది వచ్చి తన చెల్లెళ్ళు వచ్చారని చెప్పగానే ఆమె ఒక్కొక్కరినిగా తన వద్దకు పంపమని ఉత్తరువిచ్చింది. పెద్ద చెల్లెలు వచ్చింది. నూరల్‌హుదా ఆమెను పలకరించి తన సరసను కూచో బెట్టుకుని, హసన్‌ను సంబోధిస్తూ, "మానవుడా, ఈమె నీ భార్య అవుతుందా ?" అని అడిగింది.

"ఈమె సౌందర్యం సాటిలేనిది, వర్ణనాతీతం. అయినప్పటికీ ఈమెకూ నా భార్యకూ వ్యత్యాసం ఉన్నది. దానిని నేను మాటలతో వివరించి చెప్పలేను," అన్నాడు హసన్.

నూరల్‌హుదా ఇదే విధంగా తన చెల్లెళ్ళను ఒకరొకరినే లోపలికి రప్పించి, హసన్‌కు చూపి, "నీ భార్య ఈమేనా?" అని అడిగింది. అయిదుగురయారు. అందరిని గురించీ హసన్ మొదట చెప్పినట్టే చెప్పాడు. ఇంక హసన్ భార్య మాత్రమే మిగిలి ఉన్నది. ఆమెను ప్రవేశ పెట్టమని నూరల్‌హుదా ముసలిదానికి ఉత్తరు విచ్చింది. గంధర్వ చక్రవర్తి కడగొట్టు కుమార్తె లోపలికి వచ్చింది. ఆమెను చూస్తూనే హసన్ కెవ్వున అరిచి విరుచుకు పడిపోయాడు. ఆమెకూడా అతన్ని గుర్తించి



తన అక్క కూచుని ఉన్న సింహాసనం చెంత మూర్ఛ పడిపోయింది.

నూరల్‌హుదా ఇక తన ఈర్ష్యను అణుచుకోలేక, "ఆ మనిషిని పట్టుకుపోయి నగరం వెలపల పారెయ్యండి!" అని ఆడ భటులను ఆజ్ఞాపించింది. వారు హసన్‌ను సముద్రతీరాన పారేశారు.

హసన్ భార్యకు స్పృహ రాగానే నూరల్‌హుదా ఆమెతో, "సిగ్గు మాలినదానా! పాపాత్మురాలా! ఆ మనిషికీ నీకూ ఏమిటి సంబంధం? నాన్నకు తెలియకుండా వాడికి భార్యవై, తరవాత వాణ్ణి విడిచిపెట్టి వచ్చి, రెండందాలా పతిత వైనావు. నీ వంశానికి



నీవు తెచ్చిన మచ్చను నీ రక్తంతోనే కడిగెయ్యాలి," అన్నది. తరవాత ఆమె తన దాసీలతో, "ఈ పాపాత్మురాలిని గుంజకు కట్టేసి, నెత్తురు వరదలై పారేదాకా కొట్టండి!" అని ఆజ్ఞాపించింది. ఆ తరవాత ఆమె తన తండ్రికి ఒక లేఖ రాసింది. అందులో తన ఆఖరు చెల్లెలి కథ అంతా వివరించి, తాను ఆమెకు ఇవ్వబోయే శిక్ష తెలిపి, ఆయన అనుమతి శీఘ్రంగా కావాలని కోరింది. ఆ లేఖను ఒక దూత ద్వారా తండ్రికి పంపింది.

ఆ లేఖ చూడగానే చక్రవర్తి కళ్ళకు చీకట్లు కమ్మాయి. కాని ఆయన దానికి జవాబిస్తూ, "నీ చెల్లెలు చేసిన పాపానికి తగిన శిక్ష అంటూ లేదు. ఆమె ప్రాణ దండన ఎలా విధిస్తావో నీవే నిర్ణయించి, అమలు చెయ్యి." అని చెప్పాడు.

హసన్‌కు స్పృహ తెలిసేసరికి అతను సముద్రతీరాన ఉన్నాడు. అతని కిప్పుడే ఆశా లేదు. భయంకరమైన ఈ దీవుల నుంచి బయటపడే మార్గం కూడా లేదు. అతను వెర్రివాడిలాగా లేచి దిక్కు లేకుండా నడవసాగాడు. నడుస్తూ అతను రకరకాల ఆలోచనలకు గురి అయాడు. తాను స్పృహ తప్పిన సమయంలో ఏమి జరిగి ఉంటుంది? తాను సముద్ర తీరానికి చేర్చబడటానికి కారణ మేమై ఉంటుంది? ఈ అనుమానాల మధ్య అతనిలో మళ్ళీ ఆశ చిగిర్చింది.

అతనలా నడిచి వెళుతుంటే ఒక చోట ఇద్దరు ఆడ పిల్లలు, పన్నెండేళ్ళ వయసు వాళ్ళు ఒక కుళాయి కోసం పెనగులాడుతూ కనిపించారు. అది తోలుతో చేసినది. దాని మీద ఏవో అక్షరాలూ, అలంకారాలూ ఉన్నాయి. అతను ఆ పిల్లలను సమీపించి వారిని ఎడం చేస్తూ, "ఎందుకు కీచులాడు కుంటున్నారు?" అని అడిగాడు.

ఆ కుళాయి కోసం వాళ్ళు పోట్లాడు కుంటున్నారు, నాకు దొరికిందంటే, నాకు

దొరికిందంటున్నారు. "మీ తగాదా నేను తీరుస్తాను. నేనొక రాయి విసురుతాను. మీలో ఎవరు ముందు పరిగెత్తి వెళ్ళి ఆ రాయిని తీసుకొస్తే వాళ్ళది కుళాయి! సరేనా?" అన్నాడు హసన్. అందుకు వాళ్ళు సరే నన్నారు.

హసన్ ఒక రాయి బలంకొద్దీ విసిరాడు. పిల్ల లిద్దరూ దానికోసం పరిగెత్తారు. వాళ్ళు తిరిగి వచ్చేదాకా టోపీ తన నెత్తిన పెట్టుకుని హసన్ అక్కడే నిలబడ్డాడు. త్వరలోనే ఇద్దరు పిల్లలూ తిరిగి వచ్చారు. ఒకతె చేతిలో రాయి ఉన్నది. "ఇదుగో, నేను గెలిచాను. నువ్వెక్కడున్నావు?" అన్నదా పిల్ల. ఇద్దరూ తన కోసం దిక్కులు చూస్తూండటం గమనించి హసన్ ఆశ్చర్యపోయాడు. "వాళ్ళు గుడ్డివాళ్ళు కారే, ఎందుకలా దిక్కులు చూస్తారు? నే నిక్కడే ఉంటినిగా?" అనుకున్నాడు. "నే నిక్కడే ఉన్నాను!" అని వాళ్ళను కేక పెట్టాడు.

కేక వచ్చిన దిక్కుగా చూశారు పిల్లలు. కాని వాళ్ళకేమీ కనిపించక పోయేసరికి భయపడి సన్నగా ఏడుపు సాగించారు. హసన్ వాళ్ళను తాకి, "ఎందుకర్రా ఏడుస్తారూ?" అన్నాడు. దాంతో వాళ్ళకు మరింత భయం కలిగి కాలి సత్తువకొద్దీ పారిపోయారు.





"అరె, ఇది మంత్రపు కుళాయి లాగుంది. ఇది నెత్తిన పెట్టుకుంటే అదృశ్య మవుతారు కాబోలు!" అనుకున్నాడు హసన్. ఇప్పుడు తాను రహస్యంగా వెళ్ళి తన భార్యను చూడవచ్చు. అతనికి నృత్యం చెయ్యాలన్నంత ఆనందం కలిగింది. అతను వెంటనే బయలుదేరి నగరానికి వెళ్ళి ముసలిదాని కోసం వెతికాడు. ఆమె ఒక గదిలో కట్టి పడేసి ఉన్నది. తాను అదృశ్యంగా ఉన్నదీ లేనిదీ రూఢిగా తెలుసుకోవటానికి అతను ఆ గదిలో ఒక పక్కన పేర్చి ఉన్న పింగాణీ జాడీలలో ఒకటి ఎత్తి నేలకు గట్టిగా విసిరి పెద్ద చప్పుడయేలాగా పగల గొట్టాడు. ముసలిది అటూ ఇటూ చూసి, ఎవరూ కనపడక, "ఓ భూతమా, ఎవరు నీవు?" అని కేక పెట్టింది భయంతో.

"నేను భూతాన్ని కాను, హసన్‌ను. నిన్ను విడిపించటానికి వచ్చాను," అంటూ హసన్ నెత్తి మీది నుంచి కుళాయి తీసేశాడు.

"అయ్యో, హసన్! నీ వెంత దౌర్భాగ్యుడివి! మా రాణి నిన్ను ప్రాణాలతో వదిలినందుకు పశ్చాత్తాప పడి, నిన్ను పట్టుకు రమ్మని భటులను పంపింది. అందుచేత నీవు ఇక్కడ తారట్లాడక సాధ్యమైనంత వేగంగా పారిపో," అన్నది ముసలిది. ఆమె అతనితో అతని భార్యకు జరగబోయే శిక్షను గురించి కూడా చెప్పింది.

"నన్నూ, నా భార్యనూ, నిన్నూ కూడా దేవుడే కాపాడతాడు. ఈ కుళాయి చూడు. ఇది మంత్ర శక్తి కలది. దీన్ని నెత్తిన పెట్టుకుని ఎక్కడికైనా పోగలను. నన్నెవరూ చూడలేరు," అన్నాడు హసన్.

ముసలిది ఈ మాట విని పరమానందం చెంది, "అయితే నన్ను విడిపించు. నీ భార్యను బంధించిన చోటు చూపుతాను," అన్నది. హసన్ ఆమె కట్లు విప్పి, తన నెత్తిన కుళాయి పెట్టుకుని ముసలి దాని

చెయ్యి పట్టుకున్నాడు. వెంటనే ఆమె కూడా అతనితోబాటు అదృశ్యమయింది.

ముసలిది అతన్ని ఒక చీకటి కొట్టు వద్దకు తీసుకుపోయింది. హసన్ భార్య అందులోనే బంధించి ఉన్నది. ఆమె చిత్ర హింస అనుభవించటానికి ఎదురు చూస్తూ అతి దీన స్థితిలో ఉన్నది. అతను ఒక్క సారిగా తన భార్య ఎదటపడి ఆమెను కంగారు పెట్టకూడదని అనుకుని కూడా, ఆమె దైన్యాన్ని చూసి సహించలేక, తన నెత్తి మీది కుళాయి తీసేసి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. ఆమె తన భర్తను చూస్తూనే అతని చేతుల్లో మూర్ఛ పోయింది.

హసన్ ఆమె బంధాలు తెంచి, ముసలి దాని సహాయంతో ఆమెకు మూర్ఛ తెలిసే టట్టు ఉపచారాలు చేశాడు. ఆమె మెల్లిగా కళ్ళు తెరిచి, "నీవు ఆకాశం నుంచి దిగావో, భూమిలో నుంచి పైకి వచ్చావో నాకు తెలీదు. నా కర్మకు నన్ను విడిచి త్వరగా వచ్చిన దారినే వెళ్ళి పో. విధిని ఎవరు తప్పించగలరు? నా అక్క నన్ను చిత్రవధ చేయిస్తుంటే నీవు చూడలేవు," అన్నది.

"పిచ్చిదానా, నిన్ను బాగ్దాదుకు తీసుకు పోవటానికి వచ్చాను," అన్నాడు హసన్.




ఆమె నమ్మక, "నీకు పిచ్చిలో కూడా సాహసం పోలేదు," అన్నది.

"నిన్నూ, ఈ ముసలిదాన్నీ వెంట తీసుకోకుండా నే నీ భవనం నుంచి పోను. ఈ కుళాయి చూడు," అంటూ దాని ప్రభావం తన భార్యకు ప్రదర్శించి చూపాడు హసన్.

హసన్ భార్య ఆనందంతోనూ, పశ్చా త్తాపంతోనూ కన్నీరు కార్చుతూ, "నీ కష్టా లన్నిటికీ మూలం నేను బాగ్దాదు నుంచి వచ్చెయ్యటమే. నేను చేసిన పాడు పని ఏమిటో నాకు తెలుసు, అందుచేత నన్ను పని పెట్టుకుని నిందించవద్దు," అన్నది.

"కాదు, నిన్ను నా వెంట తీసుకు పోకుండా బాగ్దాదులో విడిచి వెళ్ళటమే నా తప్పు. ఇక ఎన్నటికీ అలాటి పని చెయ్యను," అన్నాడు హసన్.

అతను కుళాయి నెత్తిన పెట్టుకుని ఒక చేత భార్యనూ, రెండవచేత ముసలిదాన్నీ పట్టుకునేసరికి ముగ్గురూ అదృశ్యులయారు. ఆ స్థితిలో వారు రాజభవనం నుంచి ఎవరికీ కాన రాకుండా బయటపడి, హసన్ భార్య తన బిడ్డలను రహస్యంగా దాచి ఉంచిన చోటికి వెళ్ళారు. నాసిర్‌నూ, మన్సూర్‌నూ చూడగానే హసన్ తండ్రి హృదయం పొంగి పొర్లింది.

ముసలిది బిడ్డ లిద్దరినీ తన భుజాల పైన ఎక్కించు కున్నది. తరవాత హసన్ భార్య అదృశ్యంగా వెళ్ళి మూడు పక్షి తొడుగులు దొంగిలించి తెచ్చింది పెద్దవాళ్ళు ముగ్గురూ వాటిని ధరించి, భయంకరమైన వాక్-వాక్ దీవుల నుంచి శాశ్వతంగా ఎగిరిపోయారు.

వారు ఏకంగా బాగ్దాదులో హసన్ ఇంటి డాబాపై వాలి, మెట్ల మీదుగా కిందికి దిగి హసన్ తల్లి ఉన్న చోటికి వచ్చారు. ఆమె అసలే వృద్ధురాలు. ఏడిచి ఏడిచి ఆమెకు దృష్టి కూడా సరిగా లేకుండా పోయింది. దిక్కులేని ఆ వృద్ధురాలు అవసాన దశలో ఉన్నది. హసన్ ఆమె గది తలుపు తట్టి, "అమ్మా, తలుపు తియ్యి! శుభవార్త!" అనగానే ఆమె ప్రాణం లేచి వచ్చిన దానిలాగా ఒక్క పరుగున వచ్చి తలుపు తీసి, తన కొడుకునూ, కోడలినీ, మనమలనూ, ముసలిదాన్నీ చూసి, ఆనందో ద్రేకం పట్టలేక మూర్ఛపోయింది.

హసన్ తన తల్లికి ఉపచారాలు చేసి స్పృహ తెప్పించాడు. అతని భార్య ఆమెకు తాను చేసిన తప్పుకు క్షమాపణ చెప్పు కున్నది. జరిగిన విచిత్ర సంఘటన లన్నీ హసన్ తల్లికి చెప్పాడు. తరవాత అందరూ సుఖంగా ఉన్నారు. —(అయిపోయింది)





# చాణక్యుడి కథ

పూర్వం చణక అనే గ్రామంలో చణి అనే బ్రాహ్మణు డుండేవాడు. అయిన జైన మతా వలంబి. అయన భార్య పేరు చణేశ్వరి. వారి కొక కుమారుడు కలిగాడు. అతనే చాణక్యుడని ప్రసిద్ధి కెక్కాడు.

చాణక్యుడు అందరు పిల్లల్లాగా కాక పుట్టటమే అన్ని పళ్ళతోనూ పుట్టాడు. మునులు ఈ వింత వృత్తాంతం విని అలా పుట్టినవాడు రాజవుతాడన్నారు. తండ్రి ఐహిక చింత కన్న పరతత్వచింత హెచ్చుగా కల వాడు కావటంచేత, తన కొడుకుకు ఇహ భోగ్యా లంత మంచిది కాదని భావించి, అతని పళ్ళు పీకించేశాడు. ఇలా జరగటం వల్ల చాణక్యుడు పరోక్షంగా రాజ్యపాలన చేస్తాడని మునులు మళ్ళీ జోస్యం చెప్పారు.

చాణక్యుడు సమస్త శాస్త్రాలూ చక్కగా చదువుకుని, పెద్దవాడై, ఒక పేద బ్రాహ్మణ కన్యను వివాహమాడాడు. ఒక సారి చాణక్యుడి భార్య, తన తమ్ముడి వివాహ సందర్భంగా, తన పుట్టింటికి వెళ్ళింది. అక్కడికి ఆమె యొక్క అప్పచెల్లెళ్ళు వచ్చారు. వారి భర్తలు ధనికులు కావటం చేత వారు గొప్పస్థితిలో ఉండి, ఆమె పేద రికాన్ని అవహేళన చేశారు. అవమాన పీడుతురాలై ఇంటికి తిరిగి వచ్చిన భార్యను ప్రశ్నించి చాణక్యుడు జరిగిన సంగతి తెలిసి, ధనార్జనకు బయలుదేరాడు.

పాటలీపుత్రాన్ని ఏలే నందరాజు అర్హత గల బ్రాహ్మణులను ఘనంగా సత్కరిస్తా డని విని, చాణక్యుడు పాటలీపుత్రం అస్థా నానికి వెళ్ళి, అక్కడ ఖాళీగా ఉన్న ఆసనా లలో పెద్దదిగా చూసి అందులో కూచు న్నాడు. అది నందమహారాజు ఆసనం.

కొంతసేపటికి నందరాజూ, ఆయన కొడుకూ వచ్చారు. అక్కడ ఉండే పరి చారిక చాణక్యుడికి మరొక ఆసనం

[జైనపురాణ గాథ]



చూపింది. అయినప్పటికీ చాణక్యుడు తాను కూచున్న ఆసనం నుంచి లేవకపోగా, తన జలపాత్రను ఒక ఆసనం మీదా, చేతికర్ర మరొక ఆసనం మీదా, తన తావళాన్ని ఇంకొక ఆసనం మీదా, తన యజ్ఞోపవీతాన్ని వేరొక ఆసనం మీదా ఉంచాడు. పరిచారిక ఈ ధూర్తత్వం సహించలేక చాణక్యుణ్ణి తన్ని ఆసనం మీది నుంచి లాగి బయటికి గెంటింది. చాణక్యుడు పట్టరాని కోపంతో నందరాజ్య నిర్మూలనం చేస్తానని ప్రతిజ్ఞ చేసి, పాటలీపుత్రం విడిచి వెళ్ళిపోయాడు.

మరొకరి ద్వారా రాజ్యపాలన చేసే యోగం తనకున్నదన్న సంగతి తెలుసు గనక చాణక్యుడు తన ప్రతినిధిగా రాజుగా ఉండే వాడి కోసం అన్వేషణ సాగించాడు. ఆయన సంచారంచేస్తూ మయూరపోషకు లుండే గ్రామానికి వచ్చాడు. ఈ మయూర పోషకులు రాజుగారి నెమళ్ళను పోషిస్తారు. గ్రామ పెద్దయొక్క కుమార్తె గర్భవతిగా ఉండి, చంద్రుణ్ణి తాగాలన్న కోరికతో తహ తహలాడుతున్నట్టు చాణక్యుడికి తెలిసింది.

"ఆమెకు పుట్టబోయే బిడ్డను నేను పెంచుకునే షరతు మీద నేనామె కోరిక తీర్చగలను," అని చాణక్యుడు గ్రామ పెద్దతో అన్నాడు. ఇందుకు గ్రామపెద్దా, అతని భార్యా కూడా సమ్మతించారు.

చాణక్యుడు ఒక గుడిసె కట్టించి దాని కప్పులో ఒక కంత ఏర్పాటు చేయించాడు. రాత్రివేళ చంద్రకిరణాలు పడేచోట పాల గిన్నె ఉంచి, గర్భవతిని గుడిసెలోకి తీసుకు పోయి, "అదుగో, చంద్రుడు. దాన్ని తాగెయ్యి," అన్నాడు. ఆమె నిజమేనన్న భ్రమలో పాలు తాగేటప్పుడు, కప్పుపైన ఉన్న ఒక మనిషి కప్పులోని రంధ్రాన్ని క్రమంగా మూసేశాడు. తాను చంద్రుణ్ణి తాగేశానని గర్భవతి తృప్తిపడింది. ఈ కారణంగా ఆమెకు పుట్టిన కుర్రవాడికి చంద్రగుప్తుడు అని పేరు పెట్టారు.

ఇది జరిగినాక చాణక్యుడు ధనార్జన కోసం మళ్ళీ దేశాటన సాగించాడు. ఆయన ఆ గ్రామానికి తిరిగిరావటానికి కొంతకాలం పట్టింది. వస్తూండగా ఆయనకు కొందరు పిల్లలు కనిపించారు. వారిలో చంద్రగుప్తుడు కూడా ఉన్నాడు. అతను రాజులాగా ప్రవర్తిస్తున్నాడు, మిగిలినవాళ్ళు అతన్ని రాజులాగే చూస్తున్నారు. చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి గుర్తించలేదు, కాని అతని ఠీవి చూసి ఆశ్చర్యపడి, అతడి శక్తి పరీక్షించటానికి, తన కేమైనా దానం చెయ్యమన్నాడు.

"ఆ కనిపించే ఆవుల మందను తీసుకుపొండి. నే నిచ్చానంటే ఎవరూ అభ్యంతరం చెప్పరు," అన్నాడు చంద్రగుప్తుడు. చాణక్యుడు సంతోషించి, ఆ కుర్రవాడే చంద్రగుప్తుడని ఇతర పిల్లల నడిగి తెలుసుకున్నాడు. "నీవు రాజువైనప్పుడు నీకు రాజ్యం కావాలి గద! నే నిప్పిస్తాను, నా వెంట రా, నాయనా!" అని ఆయన చంద్రగుప్తుణ్ణి తన వెంట తీసుకుపోయాడు.

తాను సంపాదించిన ధనంతో చాణక్యుడు సైనికమూక నొకదాన్ని పోగుచేసి పాటలీపుత్రాన్ని ముట్టడించాడు. బలమైన శత్రుసేనలు చాణక్యుడి సేనను అవలీలగా చిత్తుచేసి పారేశాయి. చాణక్యుడూ, చంద్ర



గుప్తుడూ ప్రాణాలతో పారిపోసాగారు. నందుడి సైనికులు వారిని తరుముకొచ్చారు. చాణక్యుడూ, చంద్రగుప్తుడూ ఒక సరస్సు వద్దకు చేరుకునే సరికి వారిని తరుముకొచ్చే సైనికులలో ఒకడు దగ్గిరపడ్డాడు. అప్పుడు చాణక్యుడు ఒక యుక్తి పన్నాడు. తాను తపస్విలాగా సరస్సు ఒడ్డున కూచుని, చంద్రగుప్తుణ్ణి నీటిలోకి దిగమన్నాడు.

అశ్వికుడు చాణక్యు డున్నచోటికి వచ్చి, "ఇటుగా ఎవరన్నా పరిగెత్తుకుంటూ వచ్చారా?" అని అడిగాడు. చాణక్యుడు నీటిలో ఉన్న చంద్రగుప్తుడి కేసి చూపాడు. వెంటనే సైనికుడు గుర్రం దిగి, తన కత్తి

పక్కనపెట్టి, నీటిలో దిగటానికి కవచం విప్పసాగాడు. ఆ క్షణంలో చాణక్యుడు లేచి, సైనికుడి కత్తి తీసి వాడి కంఠం తెగవేశాడు.

తరవాత చాణక్యుడూ, చంద్రగుప్తుడూ ఆ సైనికుడి గుర్రం మీద ఎక్కి పలాయనం సాగించారు. అప్పుడు చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి, "ఆ సైనికుడు నీటిలో ఉన్న నిన్ను చూసినప్పుడు నీకే మనిపించింది ?" అని అడిగాడు.

"కర్తవ్యం గురువుగారికే తెలుసు నను కున్నాను," అన్నాడు చంద్రగుప్తుడు.

దీనినిబట్టి, చంద్రగుప్తుడు రాజై తాను మంత్రి అయినప్పటికీ, అతను తనకు విధే యుడై ఉండగలడని చాణక్యుడు గ్రహించాడు. ఇంతలో మరొక అశ్వికుడు వారిని తరుముతూ వచ్చాడు. చాణక్యుడు వాణ్ణి కూడా యుక్తితో చంపేశాడు. ఈ సారి ఆయన బట్టలు ఉతికే చాకలి నొకణ్ణి, "రాజుగారు మీ చాకలివాళ్ళ మీద అలిగి, నిన్ను పట్టుకోవటానికి సైనికుణ్ణి పంపు తున్నారు," అని భయపెట్టి పంపేసి, వాడి స్థానం తాను ఆక్రమించి చంద్రగుప్తుణ్ణి నీటి లోకి పంపాడు. రెండవ అశ్వికుడు వచ్చాక ఇద్దరూ పలాయనం సాగించారు.

తిండికి మాడుతూ వారిద్దరూ ఆ సాయంకాలం ఒక గ్రామం చేరారు. ఎవరు తిండి



పెడతారని చూస్తూ గ్రామంలో నడుస్తుండగా ఒక ఇంట వారి కొక విషయం గోచరమయింది. ఒక బీదది, వయసుమళ్ళినది తన పిల్లల కోసం వంట చేసి కంచాలలో వడ్డించింది. ఒక కుర్రవాడు ఆత్రంగా అన్నంలో చెయ్యిపెట్టే సరికి చెయ్యి చురుక్కుమన్నది. ఇది చూసి తల్లి, "ఏమిరా, నీవు చాణక్యుడిలాగే మందమతివిలాగున్నావే!" అన్నది.

ముక్కూ మొగమూ ఎరగని ఆ పేద స్త్రీ తనని అంత మాట అన్నందుకు ఆశ్చర్యపడి చాణక్యుడు ఆ ఇంటిలో ప్రవేశించి ఆమె అలా అనటానికి కారణం అడిగాడు.

"ఒక చివర నుంచి చల్లబడిన అన్నం తింటూరాక, వీడు కంచం మధ్యనే చెయ్యి పెట్టి కాల్చుకున్నాడు, నాయనా! చాణక్యుడిలాటి బుద్ధి తక్కువ పనే గదా చేశాడు? పరిసరాలు జయించుకుంటూ పోక ఏకంగా రాజధానినే ముట్టడించాడు!" అన్నది ఆ పేదరాలు.

ఇది చాణక్యుడికి మంచి గుణపాఠమయింది. ఆయన హిమవత్కూటానికి వెళ్ళి, ఆ రాజ్యాన్ని ఏలే పర్వతకుడనే రాజుతో ఒక ఒడంబడిక చేసుకున్నాడు. దాని ప్రకారం పర్వతకుడు నందరాజును జయించటానికి చాణక్యుడికి సహాయ





పడాలి; అందుకుగాను అతను నందుడు ఓడినాక రాజ్యంలో సగం పొందుతాడు.

ఈ ఒప్పందం ప్రకారం చాణక్యుడూ, పర్వతకుడూ ఏకమై పాటలీపుత్ర పరిసర ప్రాంతాలన్నిటినీ జయించసాగారు. ఒక నగరం వారికి లొంగక బలంగా నిలబడింది. దాన్ని జయించే మార్గం తోచక చాణక్యుడు ఒక త్రిదండి సన్యాసి వేషం ధరించి నగరం ప్రవేశించాడు. నగరంలో సప్తమాతృకాలయం ఉన్నది. ఆ ఆలయంలో ఉండే ఏడుగురు దేవతలూ ఆ నగరాన్ని కాపాడతారని అక్కడి ప్రజల విశ్వాసం. శత్రువుల ముట్టడితో విసిగి వేసారి ఉన్న పౌరులు కొందరు సన్యాసి వేషంలో ఉన్న చాణక్యుణ్ణి చూసి, "స్వామీ, ఈ ముట్టడి ఎప్పటికి అంతమవుతుంది?" అని అడిగారు.

"నాయనలారా, సప్తమాతృకలు ఆలయాన్ని విడిచిపెడితేగాని ఈ ముట్టడి పోదు," అని చాణక్యుడు వారితో చెప్పాడు. మూఢులైన ఆ పౌరులు ఈ మాట నమ్మి ఆలయంలో నుంచి సప్తమాతృకల విగ్రహాలను తీసేశారు. చంద్రగుప్తుడికీ, పర్వతుడికీ చాణక్యుడి సంకేతం అందింది. వారు ముట్టడి ఎత్తేసి వెళ్ళిపోతున్నట్టుగా కొంత దూరం సైన్యాలను తీసుకుపోయారు. నగరవాసులు ముట్టడి తొలగినందుకు పరమానందం చెంది, ఉత్సాహంలో మునిగి తేలుతున్న సమయంలో సేనలు ఆకస్మికంగా వచ్చిపడి నగరాన్ని వశపరుచుకున్నాయి.

చాణక్యుడు పాటలీపుత్రం పైకి వెళ్ళాడు. ఈసారి జరిగిన యుద్ధంలో నందుడు ఓడి, చాణక్యుడికి లొంగిపోయాడు. చాణక్యుడు నందుణ్ణి ప్రాణాలతో వదిలిపెడుతూ, "నీవు దేశం విడిచి వెళ్ళు. ఒక్క రథంలో తీసుకుపోగలిగినంత సంపదను నీ వెంట తీసుకుపోవచ్చు," అన్నాడు.

ఆ ప్రకారమే నందుడు రథం మీద తన ఇద్దరు భార్యలనూ, తన కుమార్తె అయిన

దుర్ధరనూ ఎక్కించుకుని, అమూల్యమైన నగలూ అవీ వెంటపెట్టుకుని బయలు దేరాడు. దారిలో వారికి చంద్రగుప్తుడు రథ మెక్కి వస్తూ ఎదురయాడు. చంద్రగుప్తుణ్ణి చూస్తూనే దుర్ధరకు గాఢమైన ప్రేమ పుట్టు కొచ్చింది. తన కుమార్తె మనోభావం గ్రహించి నందుడు ఆమెతో, "అమ్మా, నీవు స్వయం వరం చేసుకో గోరితే నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు.

తండ్రి ఈ మాట అనగానే దుర్ధర తన తండ్రి రథం నుంచి దిగి చంద్రగుప్తుడి రథం ఎక్కింది. ఆమె అలా ఎక్కుతూండగా చంద్రగుప్తుడి రథచక్రం యొక్క ఆకులు తొమ్మిది పెళపెళా విరిగాయి. ఈ శకునం చూసి చంద్రగుప్తుడు దుర్ధరను నిరాకరించ బోయాడు. కాని చాణక్యు డతన్ని వారించి, "నాయనా, ఇది మంచి శకునం. నీ వంశం వారు తొమ్మిది తరాలపాటు రాజ్యమేల గలరని దీని అర్థం," అన్నాడు.

తరవాత చాణక్య చంద్రగుప్తులు నందుడి రాజభవనం వశపరచుకుని అందులోని సొత్తంతా సమంగా పంచుకున్నారు. ఆ భవనంలో ఒక దాసీ ఉన్నది. ఈమెకు విషం అలవాటయింది. ఆ దాసీని తన కిమ్మని పర్వతు డడిగాడు. చాణక్యుడు సమ్మతించాడు. అగ్నిసాక్షిగా పర్వతు డామెను పెళ్ళాడుతూ ఆమె చెయ్యి పట్టు కునే సరికి, ఆమె చేతి చెమట ద్వారా విషం పర్వతుడి శరీరంలో ప్రవేశించింది. అతను విరుచుకు పడిపోతూ వైద్యులను పిలవ మన్నాడు. చంద్రగుప్తుడు వైద్యుల కోసం కబురు చెయ్యబోతూ ఉంటే చాణక్యు డతన్ని వారించాడు.

వైద్య సహాయం కూడా లేకుండా, అర్ధ రాజ్యం పొందవలసిన పర్వతుడు ప్రాణాలు వదిలాడు. పైపెచ్చు పర్వతుడి రాజ్యం కూడా చంద్రగుప్తుడిదే అయింది.

[వచ్చే సంచికలో ముగింపు]





# కిష్కింధా కాండ

రాముడు దుఃఖంతో మూర్ఛపోయి ఉన్న తారను చూశాడు. అది గమనించి వానరులు తారను వాలి శరీరం మీది నుంచి పట్టి లేవదీశారు. తార రాముణ్ణి చూసి అతన్ని సమీపించి, "రామా, నా భర్త ప్రాణాలు తీసిన బాణంతోనే నన్ను కూడా చంపి, నా భర్త వద్దకు చేర్చు. సీత కోసం నీవు ఎలా తపిస్తున్నావో, వాలి నా కోసం ఆ లోకంలో అలా తపిస్తాడు. భార్యా వియోగం ఏమిటో నీకు తెలుసుగదా! వాలి పోయాక నేను జీవచ్ఛవాన్నే గనక స్త్రీ హత్యాదోషం నిన్నంటదు," అంటూ ఏడ్చింది. రాముడు తారనూ, సుగ్రీవుణ్ణీ యథోచితంగా ఊరడించాడు. వాలి దహన క్రియల పని చూడమని లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి హెచ్చరించాడు. తారుడు కిష్కింధకు వెళ్ళి వాలిని మొయ్యటానికి ఒక పల్లకీ తెచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ వాలిని ఎత్తి పల్లకీలో పడుకో బెట్టారు. బలిష్ఠులైన వానరులు పల్లకి మోస్తూ వెళ్ళారు. వెనక కిష్కింధా నగర స్త్రీలు ఏడుస్తూ వెళ్ళారు. ఒక వాగు ఒడ్డున ఇసుక ప్రదేశంలో వాలికి చితి ఏర్పాటయింది. అంగదుడు శాస్త్రోక్తంగా చితికి నిప్పు పెట్టాడు. తరవాత వానరులు వాలికి జలతర్పణాలు విడిచారు.

ఉత్తరక్రియలు పూర్తి కాగానే సుగ్రీవుడు తడి బట్టలతో, తన మంత్రులను వెంట బెట్టుకుని రాముడి వద్దకు వచ్చాడు.



అప్పుడు హనుమంతుడు రాముడితో, "మీ అనుగ్రహం చేత సుగ్రీవుడు వానర రాజ్యాన్ని పొందగలిగాడు. అతనిక రాజ్య భారం వహించవలిసి ఉన్నది. అందుచేత మీరు వచ్చి అతనికి సక్రమంగా పట్టాభి షేకం చేయించండి," అన్నాడు.

దానికి రాముడు, "హనుమంతుడా, తండ్రి అనతి ప్రకారం నేను పధ్నాలుగేళ్ళ పాటు గ్రామాలలోకీ, నగరాలలోకీ అడుగు పెట్ట వీలులేదు. అందుచేత మీరంతా సుగ్రీవుణ్ణి కిష్కింధకు తీసుకుపోయి శాస్త్ర ప్రకారం పట్టాభిషిక్తుణ్ణి చెయ్యండి," అన్నాడు. రాముడు సుగ్రీవుడితో అంగదుణ్ణి యువరాజును చెయ్యమనీ, వర్షాకాలం అరంభం కాబోతున్నది గనుక వానలు పోయేదాకా తానూ, లక్ష్మణుడూ ఋశ్యమూకం మీది గుహలో ఉంటామనీ, కార్తికమాసం ఆరంభమయేటప్పుడు సుగ్రీవుడు రావణుడిపై యుద్ధ యత్నాలు ఆరంభించవలిసి ఉంటుందనీ చెప్పాడు.

సుగ్రీవుడు కిష్కింధకు వెళ్ళి యథా విధిగా పట్టాభిషేకం చేసుకున్నాడు. కిష్కింధ వాసులందరు సంతోషించారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతో సుగ్రీవుణ్ణి అభిషేకించారు.

తన పట్టాభిషేకం పూర్తి కాగానే సుగ్రీవుడు అంగదుడికి యౌవరాజ్య పట్టాభిషేకం చేసి, అంగదుడిపై అదరాభిమానాలు గల కిష్కింధ పౌరులకు ఆనందం కలిగించాడు. తరవాత అతను రామలక్ష్మణుల వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పి, కిష్కింధకు తిరిగి వచ్చి తన భార్య అయిన రుమతో సుఖంగా కాలం గడపసాగాడు.

సుగ్రీవుడు రాజ్యాభిషిక్తుడైనాక రామలక్ష్మణులు తమ నివాసాన్ని ప్రస్రవణ పర్వతం పైన ఉండే ఒక విశాలమైన గుహకు



మార్చుకున్నారు. ఈ గుహ అన్ని విధాలా సౌకర్యంగా ఉన్నది. గుహలోకి వాన జల్లు రాదు, ఈదురుగాలి రాదు. పరిసరాలు ఎంతో అందంగా ఉన్నాయి. సమీపంలోనే నది ఉన్నది. అదీకాక ఈ గుహ కిష్కింధకు చాలా దగ్గిర; కిష్కింధలోని గీత వాద్య ధ్వనులూ, వానరుల కేకలూ ఆ గుహకు వినిపిస్తున్నాయి.

ఇలాటి గుహలో రాముడు అహో రాత్రాలు సీతకై విరహం పొందుతూ, లక్ష్మణుడి చేత హెచ్చరించబడుతూ, సుగ్రీవుడు ప్రత్యుపకారం చెయ్యకపోతాడా అని ఆశ్చర్యపడుతూ, ఈ నాలుగు మాసాలూ గడిచి శరత్కాలం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తూ కాలం గడపసాగాడు.

వానాకాలం వచ్చింది, వెళ్ళింది. సుగ్రీవుడు తన భార్య అయిన రుమతోనూ, వాలి భార్య అయిన తారతోనూ భోగాలలో మునిగి తేలుతూ, రాజ్యభారం మంత్రులపై వేసి, రామకార్యం నిర్వర్తించే సమయం వచ్చిందన్న మాటకూడా తలపెట్టలేదు.

అందుచేత హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వచ్చి, "నీకు రాజ్యమూ, కీర్తి లభించాయి. శత్రుభయం ఏమీలేదు. కాని మన మిత్రుల పని చూడవలిసిన బాధ్యత అలాగే ఉండిపోయింది. ఇలాటి పనులలో జాప్యం కూడా తప్పే. అందుచేత వెంటనే సీతను వెతికే పని ప్రారంభించు. నీ సహాయం కోసం ఎంత ఆత్రంగా ఎదురు చూస్తున్నప్పటికీ, భార్యా వియోగంతో ఎంతగా తపించి పోతున్నప్పటికీ రాముడు నీ బాధ్యతను జ్ఞాపకం చెయ్యటం లేదు. అతను అడగక ముందే మనం పని ప్రారంభిస్తే మనకు అలక్ష్యదోషం ఉండదు. నీ మాట నీవు నిలబెట్టుకుంటావనే ఉద్దేశంతో అతను ఎదురు చూస్తున్నాడు. ఇంక అలస్యం చెయ్యటం భావ్యం కాదు," అన్నాడు. ఈ హెచ్చరికతో సుగ్రీవుడు చైతన్యం



పొందాడు. అతను నీలుణ్ణి పిలిచి సైన్యా లన్నిటినీ రప్పించమని ఆజ్ఞాపించాడు; ఏ వానరుడు గాని పదిహేను రోజుల లోపుగా కిష్కింధకు చేరకపోతే వాడికి మరణ దండన విధించమన్నాడు; జాంబవంతాదుల దగ్గిరికి అంగదుణ్ణి వెంట బెట్టుకుని నీలుణ్ణి స్వయంగా వెళ్ళమన్నాడు.

ఒకనాడు లక్ష్మణుడు ఫలాల కోసం కొండ కోనలన్నీ చెడతిరిగి వచ్చేసరికి రాముడు అగాధమైన దుఃఖంలో మునిగి ఉన్నాడు. అతనికి శరత్కాలంతోబాటు సీతా వియోగ బాధ కలిగి దుఃఖం ముంచు కొచ్చింది. లక్ష్మణుడు తన అలవాటు ప్రకారం రాముణ్ణి ఊరడించి, దుఃఖం నిరుపయోగ మనీ, కర్తవ్యం నెరవేర్చటానికి ధైర్యమూ, ఉపాయమూ కావాలనీ జ్ఞాపకం చేశాడు.

అంతా విని రాముడు, "లక్ష్మణా, వానా కాలం వెళ్ళి శరత్కాలం వచ్చింది. ఈ నాలుగు నెలలూ ఎంతో బాధతో గడిపాను. రాజులు యుద్ధాలకు బయలుదేరే సమయం వచ్చినా సుగ్రీవుడి జాడలేదు. అతను ఏ ప్రయత్నంలోనూ ఉన్నట్టు కనపడడు. అతనికి నా మీద ఇంకా దయ రాలేదు. 'రాముడు దిక్కులేనివాడు, రాజ్యభ్రష్టుడు, అడవుల పాలై, భార్యను రావణు డపహ రించగా దైన్యంతో మన శరణు జొచ్చాడు,' అని సుగ్రీవుడు నన్ను అనాదరంగా చూస్తు న్నట్టున్నాడు. లేక తన పని గడిచిందిగదా అని తాను చేసిన వాగ్దానాన్ని మరిచాడో! నీవు కిష్కింధకు వెళ్ళి నేను చెప్పినట్టుగా అతనితో చెప్పు; అన్న మాట నిలబెట్టుకోని వాడు పురుషాధముడు. ప్రత్యుపకారం చెయ్యని వాడి శవాన్ని కాకులూ గద్దలూ కూడా ముట్టవు. అతనికి నా బాణంయొక్క ధ్వని మళ్ళీ వినాలని ఉన్నదేమో! ఇందుకేనా ఈ సుగ్రీవుడితో నేను స్నేహం చేసి, వాలిని చంపింది? వాలిని ఒక్కణ్ణే చంపాను, ఈ సుగ్రీవుణ్ణి బంధువులతో సహా



చంపగలను. అందుచేత నీవు సుగ్రీవుడితో ఎలా చెప్పాలో అలా చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడిపై పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను రాముడితో, "నీ మూలానే తనకు రాజ్యప్రాప్తీ, భార్యాప్రాప్తీ కలిగిందని కూడా తలచకుండా ఆ సుగ్రీవుడు, తాగి భార్యలతో తల కిందులై పోతున్నాడు. ఇలాటివాణ్ణి రాజుగా ఉండనివ్వరాదు. నాకు మండిపోతున్నది. ఇప్పుడే వెళ్ళి వాణ్ణి వాలి దగ్గిరికి పంపించేస్తాను, సీతను వెతకటానికి అంగదుడున్నాడు, వానర వీరులున్నారు," అన్నాడు, బాణాలు తీసుకుని బయలుదేరుతూ.

రాముడు లక్ష్మణుడితో శాంతంగా, "లక్ష్మణా, తొందరపడకు. మిత్రవధ చేసి నిష్కారణంగా పాపం అంటగట్టుకోకు. సుగ్రీవుడు అన్న సమయానికి రాకపోవటం తప్ప వేరే మహాపరాధం ఏం చేశాడు? నీవు వెళ్ళి అతనితో మృదువుగానే మాట్లాడు," అని అతన్ని పంపేశాడు.

లక్ష్మణుడు కిష్కింధ చేరి సుగ్రీవుడి ఇంటికి బయలుదేరాడు. అణగని కోపంతోనూ, అతి వేగంతోనూ పోతున్న లక్ష్మణుణ్ణి చూసి పెద్ద పెద్ద వానర వీరులు, అతనెవరో శత్రు వనుకుని, అతని పైన వెయ్యటానికి చెట్లు పీకారు. అది చూసి లక్ష్మణుడు వారికేసి నిప్పులు కక్కుతూ చూశాడు. దానితో వారు భయపడి దూరంగా తొలగారు. కొందరు సుగ్రీవుడి ఇంటికి వెళ్ళి లక్ష్మణుడు వస్తున్నాడని చెప్పారు. కాని తారతో సరససల్లాపాలలో మునిగి ఉన్న సుగ్రీవుడా మాట వినిపించుకోలేదు.

ఈలోపల సుగ్రీవుడి మంత్రులు, లక్ష్మణుడు నిజంగా వస్తున్నాడేమో చూసి రమ్మని కొందరు వానరులను పంపారు. వాళ్ళతో బాటు వచ్చిన అంగదుణ్ణి చూసి లక్ష్మణుడు, "నేను వచ్చానని సుగ్రీవుడితో చెప్పు. నాతో మాట్లాడతాడో లేదో, తెలుసుకుని వెంటనే



రా!" అన్నాడు. అంగదుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, అతనికీ, తన తల్లికీ నమస్కారం చేసి, లక్ష్మణుడు చెప్పమన్నట్టే చెప్పాడు. కాని సుగ్రీవుడు తాగిన మత్తులో ఉండి ఏమీ వినిపించుకోలేదు. అయితే లక్ష్మణుడి రౌద్రాకారం చూసి వానరులు చేసిన కలకలానికి సుగ్రీవుడి మత్తు కొంత వదిలింది.

అంగదుడు అవతలికి వెళ్ళి ప్లక్షుడూ, ప్రభావుడూ అనే మంత్రులతో సుగ్రీవుడి వద్దకు తిరిగి వచ్చేసరికి అతను కొంత స్పృహలో ఉన్నాడు. వారు అతనితో లక్ష్మణుడు మాట్లాడటానికి వచ్చాడని చెప్పారు.



లక్ష్మణుడు ఉత్తగా కాక ధనుర్బాణాలతో సహా వచ్చాడనీ, చాలా కోపంలో ఉన్నాడనీ సుగ్రీవుడికి తెలిసింది.

సుగ్రీవుడు మంత్రులతో, "నేనేమీ తప్పు చేయలేదే, లక్ష్మణుడికి ఆగ్రహం ఎందుకు కలిగి ఉంటుంది? నా శత్రువు లెవరో అతనితో నాపై చాడీలు చెప్పి ఉంటారు. మీ తెలివితేటలన్నీ ఉపయోగించి అతని కోప కారణం తెలుసుకోవాలి. రామలక్ష్మణులంటే నాకు భయమని కాదు, కాని మిత్రుడికి కోపం వచ్చినప్పుడు ఆందోళన చెందటం సహజం. రాముడు చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యటం నాకు సాధ్యంకాదు," అన్నాడు.

అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడితో, "రాజా, రాముడికి నీ మీద అలక వచ్చి ఉంటుందేగాని నిజమైన ఆగ్రహం రాదు. నీవు ఏమరుపాటున శరదృతువు రావటం గమనించలేదు. అందుకే లక్ష్మణుడు వచ్చి ఉంటాడు. అతను కాస్త పరుషంగా మాట్లాడినా నీవు సహించాలి, ఎందుకంటే తప్పు నీదే. రాముడికి ఆగ్రహం తెప్పించటం ఎవరికీ మంచిది కాదు; అతని వల్ల లాభం పొందిన నీకు అది బొత్తిగా అనుచితం," అన్నాడు. ఈలోపుగా లక్ష్మణుడు సుగ్రీవుడి



అంతఃపురం దాకా వచ్చి, లోపల ఆడవాళ్ళ అలికిడి విని అక్కడే ఆగిపోయాడు. లక్ష్మణుడు చేసిన ధనుష్టంకార ధ్వని విని సుగ్రీవుడు అతని ఎదట పడడానికి జంకి, లక్ష్మణుడితో మాట్లాడమని తారను పంపాడు.

తార లక్ష్మణుడున్న చోటికి వచ్చి, "మీకు కోపం వచ్చిందిట, దేనికి? మీ మాటను ఎవరైనా అతిక్రమించారా?" అని అడిగింది.

"సుగ్రీవుడు అస్తమానమూ తాగి ఉండి రాచకార్యాలు చూడడు, మా సంగతి ఆలోచించడు, నీకు తెలియదా? యుద్ధ సన్నాహానికి నాలుగు మాసాలు వ్యవధి తీసుకున్నాడు. గడువు దాటిపోయింది. మా పని ప్రారంభం కాలేదు. మేమేం చెయ్యాలో నీవే చెప్పు," అన్నాడు లక్ష్మణుడు.

తార అతనితో, "సుగ్రీవుడు భోగలాలసుడై ఉన్నందుకు ఆగ్రహించ వద్దు. అతను మీ పని మరవలేదు. ఇదివరకే అతను మీ పనికి వానరులను హెచ్చరించాడు. ఎక్కడెక్కడి పర్వతాల నుండో వానరులు లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి చేరారు," అని చెప్పి అతన్ని తన వెంట అంతఃపురంలోకి తీసుకుపోయింది.

కాని తీరా లక్ష్మణుడు లోపలికి వెళ్ళే సరికి సుగ్రీవుడు, తాగిన మత్తులో ఎర్రబడిన కళ్ళతో, అనేకమంది స్త్రీల నడుమ కనిపించాడు. లక్ష్మణుడికి అతన్ని చూడగానే మండిపోయింది. అతను సుగ్రీవుణ్ణి చూసి, "తనకు ఉపకారం చేసిన మిత్రులకు అబద్ధపు ప్రతిజ్ఞ చేసేవాడు పరమపాపి. కృతఘ్నుడు. వాణ్ణి ఎవరైనా చంపవచ్చు. రాముడి చేత నీ పని పూర్తి చేయించుకుని సీతను వెతికే ప్రయత్నం ప్రారంభించని నీవు కృతఘ్నుడవు. వాలి వెళ్ళిన దారి జ్ఞాపకం ఉంచుకుని సీత కోసం వెతికించు," అన్నాడు.



ప్రపంచపు వింతలు :

# 20. ఇగ్వాజు జలపాతం

ఇగ్వాజు నది బ్రెజిల్‌లోని దక్షిణ ప్రాంతపు పీఠభూమిలో పుట్టి పశ్చిమంగా 800 మైళ్ళు ప్రవహించి పరనా అనే నదిలో కలుస్తుంది. ఈ నది ఎత్తిపోతలకూ, జలపాతాలకూ ప్రసిద్ధమైనది. దీని తాలూకు జలపాతా లన్నిటిలోకీ ప్రఖ్యాతమైనది ఇగ్వాజు జలపాతం. అర్జంటీనా, బ్రెజిల్, పరాగ్వే సరిహద్దులు కలిసే స్థలానికి 12 మైళ్ళ దూరంలో ఈ జలపాతం ఉన్నది.

ఈ జలపాతానికి ఎగువను మూడు మైళ్ళ మేర చిల్లర జలపాతాలున్నాయి. వాటివల్ల కలిగిన వేగపు దూకుడుతో ఈ నది పాయ ఇక్కడ రెండు అంచల పాతానికి గురి అయి మళ్ళీ అసలు నదిని చేరుకుంటుంది. ఇక్కడ కనిపించే ఒక్కొక్క అంచె పాతం ఎత్తూ 180 అడుగులు మాత్రమే. కాని ఈ నదీ జలంలో ఒక భాగం సూటిగా 760 అడుగుల ఎత్తు నుంచి పతనం అవుతుంది.

వానాకాలంలో ఈ జలపాతం నిడివి 13,000 అడుగులు మించి ఉంటుంది. నిమిషానికి దాదాపు 3 కోట్ల ఘనపుటడుగుల నీరు ప్రవహిస్తుంది. ఎంతో ఖ్యాతి సంపాదించిన నయాగరా, విక్టోరియా జలపాతాలు కూడా దీనికి చాలవు.





# ప్రశ్నోత్తరాలు

1. కే. సిహెచ్. సుబ్బారావు, బలిజిపేట

అన్నయ్యా, మే సంచికలో వాలి సుగ్రీవులు యుద్ధం చేస్తున్నప్పుడు వాలి దేవేంద్రు డిచ్చిన కాంచనమాలికను మెడలో వేసుకొనే యుద్ధం చేస్తున్నట్లు 56 వ పేజీలో బొమ్మ వేశారుగదా! రాముడు సుగ్రీవుని గుర్తు పట్టలేక పోయానని చెప్పాడు. వాలి మెడలో కాంచనమాలికను చూసి గుర్తు పట్ట లేకపోయాడా.

**రాముడు చాలా దూరాన ఉండి ఉండవచ్చు. వాలి సుగ్రీవులు పోరాడినప్పుడు వెలుతురు అంతగా లేకపోయి ఉండవచ్చు. లేక మరొక కారణం ఏదైనా ఉండ వచ్చు. వాలి మెడలో కాంచనమాలిక తీయకుండా ఉండిన మాట నిజం. ఆ కాంచన మాలిక మా ఆర్టిస్టులు చిత్రించిన దానికన్న ఒక వేళ చిన్నదేమో!**

2. వి. మధుసూదనరావు, లక్నో

"గంధర్వ చక్రవర్తి కూతురు" చదువుతూంటే నా కొక అనుమానం వచ్చింది: మహమ్మదీయ మతంలో కూడ గంధర్వులుంటారా?

**గంధర్వులే ఏమిటి? స్వర్గమూ, అప్సరసలూ ఇంకా అనేకం ఇస్లాము సాహిత్యంలో ఉన్నాయి.**

3. బి. సునంద, హైదరాబాదు

రామాయణం - 26 లో సప్తజనులనే మునులు నీటిలో తలక్రిందులుగా వాయు భక్షణ చేస్తూ కాలం గడిపారని ప్రచురించారుకదా, నీటిలో వుంటూ వాయువును వారెలా భక్షించారు?

**వాయుభక్షణ కోసం పైకి వచ్చారనో, చేపలలాగా నీటిలోని వాయువును స్వీకరించా రనో అనుకోవచ్చు. పురాణాలలోని విషయాలకు హేతు వాదం తగిలిస్తే ఒక్క పురాణం కూడా నిలబడదు.**

4. *రాజులపాటి ఇందిరాదేవి, విజయవాడ*

జూన్ నెల "చందమామ"లో అర్జునుడు బభ్రువాహనుని చేతిలో మర ణించినట్లు, వెంటనే ఉలూచి ఇచ్చిన మణి వల్ల బ్రతికినట్లు వ్రాశారు. కానీ మేము చదివిన భారతంలో బభ్రువాహనుడు అర్జునుని తల ఖండిం చుట, ఉలూచి ప్రేరణతో నాగలోకమునకు పోయి నాగులను జయించి నాగరాజుయొక్క మెప్పును పొంది, మృతసంజీవి అను మణిని తెచ్చుట, నాగరాజు మంత్రికి కన్ను కుట్టి తన కుమారులచే అర్జునుని శిరమును మాయము కావించుట, చిత్రాంగద, ఉలూచి కృష్ణుని ప్రార్థింపగా కృష్ణుడు వచ్చి దుష్టులను శిక్షించి, అర్జునుని బ్రతికించుట మొదలైన కథను తీసి వేసి చాలా సింపుల్‌గా ముగించారు. కారణమేమిటో తెలియజేస్తారా?

**ఈ సింపుల్‌గా లేని కథ వ్యాస భారతంలోది కాదు, జైమిని భారతంలోది. "చంద మామ"లో వస్తున్నది వ్యాసభారత కథ.**

5. *వి. ఉమ, రాజమండ్రి*

భూమి తన చుట్టు తను తిరుగుచు సూర్యుని చుట్టు తిరుగుతుందని అందరికి తెలుసు. కాని నేను రోజు రాత్రులు ఆకాశము వైపు చుస్తూ ఉంటాను. ఆకాశము కదిలినట్టు, చంద్రుడు ప్రయాణము చేసినట్లు కని పిస్తాది. భూమిని ఎన్నిసార్లు పరీక్షగా చూచిన భూమియొక్క చలనము కనిపించదు. ఎందుచేత, అన్నయ్యా?

**ఆకాశము కదిలినట్లూ, చంద్రుడు ప్రయాణము చేసినట్లూ కనిపించటం కేవలము భ్రమ. మబ్బుల కదలిక వల్ల అలాటి భ్రమ కలగవచ్చు. ఇక భూమి యొక్క కదలిక మనకు కనిపించటానికి అవకాశమే లేదు. ఎందుకంటే భూమితోబాటు మనమూ కదులుతాము.**

6. *వి. రమేశ్, వరంగల్లు*

ఏప్రిల్ నెల "చందమామ"లో కేశవుడూ, జయమల్లు, కోయగోమాంగ్ అగాధంలో పడినప్పుడు వారి కత్తులూ, విల్లంబులూ అగాధంలో పడి పోయినవని వ్రాసినారు. కాని వారు దెయ్యపు గబ్బిలాన్ని బాణముతో ఎట్లు చంపినారు?

**అగాధంలో వారు పడకుండా వారి ఆయుధాలు మాత్రమే పడి ఉండినట్టయితే ఈ అనుమానం రావచ్చు. ఆయుధాలతో అగాధంలో పడిపోయినవారు తమ ఆయుధా లను అగాధంలోనే విడిచి రారుకదా!**

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఊహ పదకం

పంపినవారు:
పసుపులేటి, చింతూరు

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఉన్నత పథానికి

రెండవ ఫోటో: ఊహ పదకం

పంపినవారు: పసుపులేటి,

చింతూరు, (తూ॥ గోదావరి జిల్లా.)

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

ధర్మరాజు యజ్ఞదీక్ష బూనాడు. ఈ యజ్ఞంలో బ్రాహ్మణులకు దానాలు మూడింతలుగా ఇవ్వమనీ, అలా చేస్తే మూడశ్వమేధాలు చేసిన పుణ్యం లభిస్తుందనీ వ్యాసుడు చెప్పాడు.

యజ్ఞాంతంలో ధర్మరాజు తన రాజ్యమంతా వ్యాసుడికి దానం చేసి, "మహాత్మా, ఈ భూమిని మీరు గ్రహించి బ్రాహ్మణులకు పంచండి. నేనూ, నా తమ్ములూ, భార్యా వనాలకు పోతాం," అన్నాడు. "బ్రాహ్మణులకు భూమితో ఏం పని? దాన్ని నీవే ఉంచుకుని, దానికి సమానమైన విలవ గల బంగారాన్ని దానం చెయ్యి," అన్నాడు వ్యాసుడు.

అందరూ ఆనందోత్సాహాలలో ఉన్న సమయంలో కలుగులో నుంచి ముంగిస ఒకటి వచ్చింది. దాని శరీరంలో ఒక పార్శ్వం బంగారంలాగున్నది. అది అక్కడి వారితో, "ఇదొక గొప్ప యజ్ఞమనుకుంటున్నారా? ఒక ముని చేసిన పేలపిండి దానం ఇచ్చిన ఫలితాన్ని ఇది ఇయ్యదు! ఆ దానాన్ని నేను స్వయంగా చూశాను గనక నాకు తెలుసు," అన్నది.

బ్రాహ్మణులాశ్చర్యపడి, ఆ పేలపిండి దానం వృత్తాంతం చెప్పమని ముంగిస నడిగారు. ముంగిస ఇలా చెప్పింది:

కురుక్షేత్రంలో ఒక బ్రాహ్మణుడు ఉంఛవృత్తి చేసుకుని జీవించేవాడు. బ్రాహ్మణుడూ, భార్యా, కొడుకూ కోడలూ కూడా నేలపై దొరికిన ఆహారం ఏరుకుని దానితోనే పొట్టపోసుకునేవారు. ఇలా ఉండగా క్షామం వచ్చింది. చెట్లన్నీ ఎండిపోయాయి. ధాన్యం దొరకక ఆ బ్రాహ్మడి కుటుంబం ఆకలి బాధకు గురి అయింది. ఆ స్థితిలో వారి కొకనాడు కొంత యవ ధాన్యం దొరికింది. దానిని వారు పేలపిండి చేసుకుని, నాలుగు భాగాలుగా పంచుకుని తిన బోతూండగా వారి ఆశ్రమాని కొక అతిథి వచ్చాడు. అతిథికి వారు స్వాగతం చెప్పి అర్ఘ్య పాద్యా లిచ్చి లోపలికి తీసుకువచ్చారు. అతిథి ఆకలి మీద ఉండటం చూసి బ్రాహ్మణుడు తన వంతు పేలపిండి ఆయనకు ఆహారంగా ఇచ్చాడు. అతిథి సంతోషంతో ఆ పేలపిండి తిని ఆకలి తీరని వాడిలాగా కనబడ్డాడు. అది చూసి బ్రాహ్మణుడి భార్య తన వంతు పేలపిండి అతిథి కిచ్చింది. దానితో కూడా అతిథి కడుపు నిండలేదు. అందుచేత బ్రాహ్మణుడి కొడుకూ, కోడలూ కూడా తమ వంతు పేలపిండిని అతిథి కిచ్చారు. అతిథి అందరి వంతు పేలపిండీ తిని తృప్తిపొందినవాడై, "నేను యముణ్ణి. మీ దాతృత్వం పరీక్షించ వచ్చాను. మీరు చేసిన ఈ దానానికి ఫలితంగా మీ కోసం స్వర్గం ఎదురు చూస్తున్నది. వెంటనే అక్కడికి వెళ్ళిపొండి," అన్నాడు.

ముంగిస బ్రాహ్మణులతో, "ఇదంతా నేను స్వయంగా చూశాను. అందరూ వెళ్ళాక నే నా ప్రాంతంలో తిరుగుతూంటే అక్కడి తడీ, పేలపిండి తాలూకుపొడీ అంటి నా శరీరంలో ఒక పార్శ్వమంతా బంగారమయింది. మిగిలిన శరీరం కూడా బంగారం చేసుకుందామని ఎన్ని యజ్ఞాలకో వెళ్ళాను. ఎంతో ఆశతో ఇక్కడికి వచ్చాను. ధర్మరాజు చేసిన ఈ అశ్వ మేధం కూడా నా శరీరాన్ని బంగారం చెయ్యలేకపోయింది," అన్నది.

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**



# టినోపాల్ మాత్రమే బట్టలను అదనంగా తెలుపు చేస్తుందని తెలివైన తల్లులకు తెలియును!




టినోపాల్ యిచ్చే మెరుగును పెట్టండి కళకళలాడే తెల్లని యూనిఫార్మ్ కొడుకు కొన్న 'మీ పిల్లలను చూడడానికి ఎంతో ముచ్చటగా ఉంటుంది. తెల్లని దుస్తులకు కళ్లు మిరుమిట్లు గొలిపే అదనపు తెల్లదనము కలిగించుటకే టినోపాల్ ప్రత్యేకముగా తయారు చేయబడినదని తెలివైన తల్లులకు తెలియును.

**ఎంతో పొదుపు కూడ**

టినోపాల్ మెరుగు పెట్టుకొనుటకు మీకు ఏమీ ఎక్కువ ఖర్చు కాదు. ఒక బాల్చీడు బట్టలను తెల్లగా చేయుటకు టీ చెంచాలో నాలుగోవంతు టినోపాల్ మాత్రమే చాలును; టినోపాల్ యిచ్చే తెల్లదనము త్వరగా పోదు; మీరు బట్టలను ఉతుక్కొనే ప్రతిసారి టినోపాల్‌ను ఉపయోగించ పనక్కరలేదు.

జ్ఞాపకముంచుకోండి -




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాసిల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు.

ఉత్పత్తిదారులు:
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1 బి.ఆర్.

# చందమామ

ఇప్పుడు 6 భాషలలో ప్రతినెలా వెలువడుతున్నది:

తెలుగు - కన్నడము - తమిళము

హిందీ - మహరాష్ట్ర - గుజరాతీ

★

చందమామ నెలనెలా 2,50,000 గృహాలను అలంకరిస్తుంది

★

మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచారసాధనం

వివరములకు :

చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.

త్వరలో విడుదల!

కౌసల్యా ప్రొడక్షన్స్ వారి

# మంచిరోజులు వస్తాయి



దర్శకత్వం: G. విశ్వనాథం  రచన: ఆరుద్ర  సంగీతం: కోదండపాణి

నిర్మాతలు: S. భావనారాయణ, P.C. బాలకృష్ణరాజు

STUDIO MADRAS

REVATHI

మీ వంటకు మరింత
రుచిని కలుగచేయండి






ఓ.కె. వనస్పతి

వెజిటబుల్ నూనెలతో
తయారుచేయబడినది

అరోగ్యకరమైనది ... శక్తిని
కలుగచేయునది
విటమిన్ ఎ & డి కలిగియున్న
శుచికరముగా ప్యాక్ చేయబడ్డ
3 వాటమైన సైజులలో దొరకును




ది ఈస్ట్ ఏష్యాటిక్ కంపెని
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు-1



# వాటర్‌బరీస్

# విటమిన్ కాంపౌండ్‌ను

# మీరు ఎపుడు తీసుకోవాలి?




■ వాటర్ బరీస్ విటమిన్ కాంపౌండు, పిల్లలకు పెద్దవారికి, అన్ని వాతావరణములలోను... సంవత్సరములో అన్ని కాలములందు ... సిఫారసు చేయబడిన సాధారణమైన టానిక్.

■ ఎక్కువగా విటమిన్ బి కాంప్లెక్స్, మాల్ట్ ఎక్స్‌ట్రాక్టు మరియు ఆరోగ్యమునకు, సత్తువకు ముఖ్యావసరమైన ఇతర పదార్థములు కలిగి వాటర్ బరీస్ విటమిన్ కాంపౌండు ఆకలిని పుట్టించి సుఖముగా నుంచును.

## వాటర్‌బరీస్

## విటమిన్

## కాంపౌండు

వార్నర్-లేంబర్ట్ ఫార్మసూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతలలో యు. ఎస్. ఎ లో స్థాపితము)

WLY-9 TEL





శ్రీ వేంకటరామా ఫిలింస్ వారి

# విష్ణుమాయ

దర్శకత్వం నండూరి నమ్మాళ్వార్

రచన - నిర్మాత
గబ్బిట వేంకటరావు

డిస్ట్రిబ్యూటర్స్
ఆంధ్రా: పూర్ణా + సీడెడ్: వెంకటేశ్వర + నైజాం: ధనలక్ష్మి
మైసూరు: ఏషియన్ ఫిలిం ఎక్ఛేంజ్
ఒరిస్సా నటరాజా ఫిలింస్

NEGATIVE RIGHTS CONTROLLED BY
P.A. GOPALAKRISHNARAO B.Sc.
ROYAPETAH MADRAS-14

REVATHI

WITH AN EXPERIENCE OF
OVER 30 YEARS

THE

# B. N. K. PRESS

PRIVATE LIMITED,

"CHANDAMAMA BUILDINGS"

MADRAS-26 (PHONE: 41851-4 LINES)

***OFFER***
***BEST***
***SERVICES***

IN

**COLOURFUL PRINTING &**
**NEAT BLOCK MAKING**

★

*FAMOUS FOR PRECISION*
*AND PROMPTITUDE*

